KHUTBAT-II
HAQEEQAT-E-ISLAM
(Telugu)

# ఇస్లామ్ వాస్తవికత

*మూలం:*

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మలై)

*అనువాదం:*

ఎస్.ఎమ్. మలిక్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఎవరు ముస్లిమ్?

ముస్లిమ్ సోదరులారా! ముస్లిమ్ గుణ విశేషాలేమిటో మీ ముందు ఈ వేళ వివరిస్తాను. అంటే ముస్లిమ్ అవడానికి కనీసపు షరతులేవి? ముస్లిమ్‌గా పిలువబడాలంటే ఒక వ్యక్తికి కావలసిన కనీసపు ఆవశ్యకతలేమిటి? అనే విషయాలన్న మాట.

ఈ విషయాన్ని అర్థం చేసుకునే ముందు "కుఫ్ర్" (తిరస్కృతి) అంటే ఏమిటో, ఇస్లామ్ (స్వీకృతి) అంటే ఏమిటో మీకు బాగా బోధపడాలి. దేవుని విధేయతను తిరస్కరించడమే "కుఫ్ర్"; మనిషి దేవుని విధేయుడై ఉంటూ దైవం ప్రసాదించిన బోధకు భిన్నమైన ప్రతి విధానాన్ని, శాసనాన్ని, ఆజ్ఞా అధికారాన్ని తిరస్కరించడమే 'ఇస్లామ్.'

ఇస్లామ్, కుఫ్ర్‌లలోగల ఈ వ్యత్యాసం దివ్య ఖుర్‌ఆన్‌లో అతి స్పష్టంగా విశదీకరించబడింది.

**"ఎవరయితే అల్లాహ్ పంపిన బోధల ప్రకారం తీర్పు చేయరో వారే వాస్తవంగా 'తిరస్కారు'లు".**

తీర్పు చేయడమంటే కేవలం న్యాయస్థానానికెక్కిన వ్యాజ్యాలకు తీర్పు చేయడమని భావం కాదు. ప్రతి వ్యక్తి నిత్య జీవితంలో అనుక్షణం చేయవలసిన తీర్పులనే దీని భావం. "ఫలానా కార్యం చేయవచ్చునా, చేయకూడదా? ఆ కార్యాన్ని ఈ విధంగా చేస్తే బాగుంటుందా లేక మరో విధంగా చేయవలెనా? ఫలానా విషయంలో ఈ విధానాన్ని అవలంబించవలెనా లేక ఈ విధానాన్ని అనుసరించవలెనా?" అనే ప్రశ్న ప్రతి నిత్యం అన్ని సందర్భాల్లో ఎదురవుతూ ఉంటుంది. ఇలాంటి సందర్భాలన్నిటిలోనూ దైవ గ్రంథం, మహాప్రవక్త సున్నత్ (సంప్రదాయం) ఒక విధానాన్ని సూచిస్తుంది. మనిషి మనోకాంక్షలు కుటుంబంలోని ఆచారాలు, మానవులు నిర్మించుకున్న నియమాలు మరొక విధానాన్ని సూచిస్తాయి. దైవం సూచించిన విధానాన్ని వదలి మరే రీతిని అవలంబించడానికి నిర్ణయించుకున్నా మనిషి వాస్తవానికి కుఫ్ర్ మార్గాన్ని అవలంబించాడన్నమాట. ఒకవేళ యావజ్జీవితం ఇదే రీతిగా వ్యవహరిస్తే అతను పూర్తిగా తిరస్కారే. కొన్ని వ్యవహారాల్లో దైవాదేశాన్ని స్వీకరిస్తూ, మరికొన్నిటిలో తన మనోకాంక్షలకో, వంశ సాంప్రదాయాలకో లేదా మానవ నిర్మిత నియమాలకో, దైవాదేశాల కంటే ప్రాధాన్యత ఇచ్చినట్లయితే, అతను ఎంత పరిమాణంలో దైవాదేశాలను ధిక్కరిస్తాడో అంతకవరకూ కుఫ్ర్‌లో మునిగిపోయాడన్నమాటే. ఒకతను సగం తిరస్కారయితే, మరొకతను పావుతిరస్కారి. ఒకతనిలో పదో వంతు కుఫ్ర్ నిండుకుని ఉంటే మరొకతనిలో ఇరవయో వంతు ఉంటుంది. ఈ విధంగా దైవ నియమావళిని మనుషులు ఎంత వరకు ధిక్కరిస్తారో అంతవరకు వారిలో కుఫ్ర్ నిండుకున్నదని భావం.

మనిషి కేవలం దేవునికే దాసుడై పోవడం తప్ప ఇస్లామంటే మరేదీ కాదు. మనోవాంఛలకు, తాతముత్తాతలకు, వంశానికీ, వర్గానికీ, ఇటు మౌల్వీ సాహెబ్‌లకు, పీర్‌సాహెబ్‌లకూ అటు జమీందారుగారికీ, తహసిల్దారు గారికీ, మేజిస్ట్రేటుగారికీ - దేవుడు తప్ప మరెవ్వరికీ - దాసుడు కాకూడదు. దివ్య ఖుర్‌ఆన్ నందు సెలవీయబడింది.

"ఓ ప్రవక్తా! గ్రంథవహుల (యూదులతో, క్రైస్తవుల)తో చెప్పండి. రండి, మీకూ మాకూ సమ్మతమయిన మాట ఒకదానిపై ఏకమవుదాము. అది (మీ ప్రవక్త బోధించి వెళ్ళినది, మరి దైవ ప్రవక్త కావడం చేత నేను బోధిస్తున్నది) ఏమంటే, మొదటిది: మనం అల్లాహ్ తప్ప మరొకనికి విధేయులమై ఉండకూడదు. రెండవది: దైవత్వంలో అల్లాహ్ తప్ప మరొకరిని ఆయనకు సాటిగా భావించకూడదు. మూడవది: మనలోని ఏ వ్యక్తి కూడా అల్లాహ్ తప్ప ఇతర మానవుణ్ణి తన యజమానిగా, తన ప్రభువుగా ఎంచరాదు. ఈ (మూడు) విషయాలను వారంగీకరించకపోతే వారితో చెప్పివేయండి, "మేము మాత్రం ముస్లింలమే (అంటే ఈ మూడు అంశాలను స్వీకరించిన వాళ్ళము) దీనికి మీరు సాక్షులుగా ఉండాలి!" (ఆలి ఇమ్రాన్)

"వారు దైవ విధేయతామార్గం కాక వేరే ఇతర రీతిని వాంఛిస్తున్నారా? కాని వాస్తవానికి భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి వస్తువూ ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా ఆ దేవుని విధేయతనే నెరవేరుస్తున్నది. అందరూ ఆయన వైపునకు మరలిపోవలసినవాళ్ళే."

ఈ రెండు వాక్యాల్లో ఒకే విషయం వివరించబడింది. అంటే దేవుని విధేయత, ఆయన ఆజ్ఞాపాలనే నిజమయిన 'దీన్' (ధర్మం). ఇబాదత్ (దైవారాధన) అంటే అయిదు వేళలు దైవ సన్నిధిలో ప్రార్థన సలుపుకోవడం

మాత్రమే కాదు. ఇబాదత్ అంటే రేయింబవళ్ళు ప్రతి నిత్యం ఆయన ఆజ్ఞల్ని అనుసరించడం అని భావం. ఏ విషయాన్ని ఆయన నిషేధించాడో దాన్ని త్యజించాలి. ఆయన చేయమన్నదాన్నే చెయ్యాలి. ప్రతి వ్యవహారం లోనూ దేవుని ఆజ్ఞ ఏమిటో చూడాలి. మీ మనో కాంక్షలు ఏమంటున్నాయో, మీ బుద్ధి స్వీకరించగలదేమిటో, మీ తాతముత్తాతల ఆచరణలేమిటో, వంశంలో, కుటుంబంలో జరిగేదేమిటో, మౌల్వీ సాహెబ్ సెలవిచ్చేదేమిటో, గౌరవనీయులైన గురువుల వారు బోధించేదేమిటో; ఫలానా అయ్యవారి ఆదేశాలేమిటో, ఫలానా ఇంటివారి ఇష్టమేమిటోనని ఆలోచించకూడదు. మీరు దైవాజ్ఞను కాదని మరే ఇతరుల బాటను అనుసరించినా దైవత్వంలో వారిని చేర్చినట్లే. అల్లాహ్‌కు మాత్రమే ఇవ్వవలసిన స్థానాన్ని వారికిచ్చారన్నమాట. ఆజ్ఞలిచ్చేవాడు దేవుడే – ఆజ్ఞలివ్వడం దేవునికి తప్ప మరెవ్వరికీ చెల్లదు.

మీరు ఎవరికయినా దాసులయి ఉండాలంటే మిమ్మల్ని పుట్టించిన దేవుడే దానికి అర్హుడు. ఆయన శక్తి సామర్థ్యాల ఆధారంగానే కదా మీరు మీ జీవితాన్ని సాగిస్తున్నారు. భూమ్యాకాశాల్లోని ప్రతి వస్తువు ఆయనకే విధేయత చెల్లిస్తోంది. రాళ్ళు సహితమూ ఒకదానికొకటి విధేయత పాటించవు. ఏ వృక్షమూ మరొక వృక్షానికి లోబడి లేదు. ఒక జంతువు మరొక జంతువును ఆరాధించదు. మరైతే – రాళ్ళ కంటే, వృక్షాల కంటే, జంతువుల కంటే దిగజారిపోయారా మీరు? అవన్నీ దేవునికి మాత్రమే విధేయులై ఉంటే మీరు దేవుణ్ణి కాదని తోటి మానవులకు విధేయులై ఉంటారా? ఈ విషయమే దివ్య ఖుర్ఆన్‌లోని పై రెండు వాక్యాలలో వెల్లడించబడింది.

కుఫ్ర్ (తిరస్కారం) మార్గభ్రష్టతలు ఎటు నుంచి జొరబడతాయో వినండి. ఈ దుష్టపీడ ప్రవేశించే మార్గాలు మూడున్నట్లు మనకు దివ్య

ఖుర్‌ఆన్ సూచిస్తుంది. మొదటి మార్గం మానవుని మనోకాంక్షలు.

> **"అల్లాహ్ ఆదేశాలను నిరాకరించి వాటి స్థానాన్ని తన మనోకాంక్షను అంగీకరించేవానికి మించిన మార్గవిహీనుడు మరెవరు కాగలడు? ఇలాంటి అత్యాచారాలకు దేవుడు సన్మార్గం చూపడు."**
>
> (అల్ కసస్)

మానవుణ్ణి సన్మార్గం నుంచి తప్పించి వక్రమార్గానికి తీసుకుని పోవడంలో అన్నింటినీ మించినవి అతని మనోకాంక్షలేనని దీని భావం. మనోకాంక్షలకు బానిసయిన వ్యక్తి దేవుని దాసుడవడం సాధ్యపడదు. తనకు డబ్బు ప్రాప్తించే పని ఏదో, గౌరవ మర్యాదలు, పేరు ప్రతిష్టలూ ఏ కార్యం చేస్తే లభిస్తాయో, ఏంజేస్తే సుఖాస్వాదనలు ప్రాప్తిస్తాయో, ఎందులో భోగభాగ్యాలు ఉన్నాయో అంటూ ప్రతి నిత్యం నిరీక్షిస్తూ ఉంటాడు అంతే. ఈ భాగ్యాలు ఏ మార్గంలో లభిస్తాయో దాన్నే అతడు ఆశ్రయిస్తాడు. దైవం ఆ కార్యాల్ని ఎంత నిషేధించినా వినడు. ఈ భాగ్యాలు ఎందులో ప్రాప్తంకావో అలాంటి పనిని సుతరాము చేయడు. దైవం దాన్ని చేయమని ఎన్ని ఆదేశాలిచ్చినా అంతే! కనుక ఇలాంటి వ్యక్తి "దైవం" అల్లాహ్ కాదు, మనోకాంక్షలే అతనికి దైవం. సన్మార్గం అతనికి ఎలా ప్రాప్తమవుతుంది? ఈ విషయమే పవిత్ర ఖుర్‌ఆన్‌లో మరొక చోట ఈ విధంగా సూచింపబడినది.

> **"ఓ ప్రవక్తా! తన మనోకాంక్షలనే తన దైవంగా భావించుకున్న వ్యక్తి స్థితి ఏమిటో గమనించావా! ఇలాంటి వ్యక్తిని రక్షించగలవా నీవు? వారిలో అనేకులు వినగలరనీ, అర్థం చేసుకోగలరనీ అభిప్రాయ పడుతున్నావా? ఊఁహు! వీరంతా పశువుల్లాంటివారు. అంతేకాదు, వాటికంటే అధమంగా దిగజారిపోయినవారు."**
>
> (అల్ ఫుర్‌కాన్)

మనోకాంక్షల దాసుడు పశువుకన్నా నీచుడనడంలో సందేహానికి తావేలేదు. దైవం నిర్ణయించిన పరిధుల్ని అధిగమించే ఏ పశువున్నూ కానరాదు మీకు. దైవం దానికై నియమించిన ఆహారాన్నే ప్రతి జంతువూ తింటుంది. అది నిర్ణీత పరిమాణంలోనే తింటుంది. ఏ జంతువుకై ఎంత పని నిర్ణయమయిందో అంతే పని ప్రతి జంతువూ చేస్తుంది. కాని ఈ మానవుడో? తన కాంక్షలకు బానిసగా మారినప్పుడు షైతాన్ సహితం 'దేవ దేవా!' అంటూ చెవులు పట్టుకునే కార్యాలు చేస్తాడు ఈ 'మానవ పశువు!'

ఇదీ మార్గవిహీనతకు తొలిబాట. ఇక రెండవ మార్గమేమిటో చూడండి. తాతముత్తాతల నాటినుంచి వ్యవహారంలో ఉంటూవున్న ఆచారాలకు, నమ్మకాలకు, భావాలకు, తీరుతెన్నులకు మనిషి బానిస అయి వాటికి దైవాదేశాలకు మించిన ఆధిక్యత ఇస్తాడు. వాటికి భిన్నమయిన దైవాజ్ఞల్ని అతని సమక్షంలో పెట్టినప్పుడు " మా తాతముత్తాతలు ఆచరిస్తూ వచ్చిన దాన్ని మా వంశంలోనూ, కులంలోనూ, రివాజులో ఉన్నదాన్నే తానాచరిస్తాన"ని అంటాడు. ఈ రోగానికి గురయినవాడు దేవుని దాసుడెలా అవుతాడు? అతని తాతముత్తాతలు, వంశం, కులాలే అతని దైవం! తాను ముస్లిమని అసత్య వాదన చేసే హక్కు అతనికి లేదు. పవిత్ర ఖుర్ఆన్‌లో దీన్ని అతి తీవ్రంగా ఖండించడం జరిగింది.

> **"అల్లాహ్ పంపిన ఆదేశాలను అనుసరించండి" అని వారితో చెప్పినప్పుడల్లా, "మా తాత ముత్తాతల నుంచి మాకు సంక్రమించినదాన్నే మేము ఆచరిస్తాము" అని బదులిచ్చారు, వారి తాతముత్తాతలు ఏ ఒక్క విషయాన్నీ అవగాహన చేసుకోగల వివేకవంతులు కానప్పటికీ, వారు సన్మార్గాన లేనప్పటికీ, వీరు వారినే అనుకరిస్తూవుంటారా ఏమి?"**
> 
> *(అల్‌బఖర - 170)*

మరొక చోట ఇలా సెలవీయబడింది:

"రండి, దైవాదేశం మరియు ప్రవక్త ఆదర్శ సంప్రదాయాల అనుసరణ మార్గం వైపునకు రండి" అని వారిని కోరినప్పుడు, "మేము చూచిన మా పూర్వీల ఆచరణా విధానమే మాకు చాలు" అని సమాధాన మిచ్చారు. వీరి పూర్వీలు ఏ విషయమూ ఎరుగని వారయినప్పటికీ వారు సన్మార్గంపై లేకున్నప్పటికీ వారినే అనుసరిస్తూవుంటారా వీరు? విశ్వాసుల్లారా! మీకు మీ స్వీయచింత ఉండాలి. మీరు బుజు మార్గాన్ని అవలంబించసాగారంటే మార్గవిహీనులు మీకు ఎలాంటి హాని చేయలేరు. చివరికి అందరూ అల్లాహ్‌ని చేరవలసిందే; అప్పుడు మీ ఆచరణల మంచి, చెడుల్ని స్పష్టంగా చూపిస్తాడు దేవుడు."

*(అల్ మాయిదా : 14)*

ఇంచుమించు అన్ని కాలాల్లోనూ మూఢులు పాల్పడుతూ వచ్చిన వక్రమార్గం ఇది. దైవ బోధనలను స్వీకరించడంలో ఈ మార్గభ్రష్టతే ఎల్లప్పుడూ అడ్డువస్తూ వచ్చింది. లోగడ హజ్రత్ మూసా (అలై) జనులకు దైవశాసనాన్ని అనుసరించమని సందేశమిస్తే ఆనాడు కూడా జనులు ఈ బదులే ఇచ్చారు.

"మేము చూచిన మా తాతముత్తాతల ఆచరణ మార్గాన్నుంచి మమ్మల్ని దూరం చేయాలని చూస్తున్నావా?" *(యూనుస్ : 8)*

ఇలాగే హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) తన తెగవారిని బహుదైవారాధన కూడదని వారించినప్పుడు వారున్నూ ఇదే సమాధాన మిచ్చారు.

"మేమయితే మా పూర్వీల్ని ఈ 'దైవాల'కే ఉపాసనా ఆరాధనలు చేయడం చూచాము." *(అల్ అంబియా : 5)*

ఈ విధంగా ప్రతి ప్రవక్తకు ప్రతికూలంగా జనులు ఈ వాదాన్నే సమర్థించారు. అంటే, "నీవు ప్రబోధించే విషయం మాత్రం మా పూర్వుల విధానాలకు భిన్నంగా ఉంది గనుక మేము దీన్ని స్వీకరించము" అన్నదే వారి వాదన. దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలా సెలవీయబడింది:

"ఈ విధంగానే జరుగుతూ వచ్చింది. అంటే ఏ చోటైనా సావధానపరిచే ప్రవక్తను మేము పంపినప్పుడల్లా ఆ పురవాసుల్లోని సంపన్నులు; 'మా పూర్వులు; ఒక విధానాన్ని అనుసరించడం చూశాము కనుక మేము కూడా వారి అడుగుజాడల్లోనే మెదులుతున్నాము' అనే సమాధానం మాత్రమే ఇస్తూ వచ్చారు. 'మీరు చూచిన మీ పూర్వుల విధానం కంటే సమగ్రమయిన, సముచితమైన మార్గాన్ని సూచించి నప్పటికీ మీరు మీ పూర్వులనే అనుసరిస్తూ ఉంటారా?' అని తిరిగి అడిగినదానికి, "(ఏది ఏమైనా) నీవు ఇచ్చే సందేశాన్ని తిరస్కరిస్తున్నాము" అని బదులిచ్చారు. వారి సమాధానము విని మేమున్నూ వారిని బహు కఠినంగా శిక్షించాము. మా ఆదేశాలను ధిక్కరించినవారి పరిస్థితి ఎలా పరిణమించిందో గమనించండి."

(జుఖ్‌రఫ్: 22-25)

ఇదంతా వెల్లడించిన పిదప అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: ఇక మీ పూర్వులనయినా అనుసరించండి లేదా మా ఆదేశాలనయినా పాటించండి. రెండూ చేరువ కాజాలవు. ముస్లిములవగోరితే అన్నిటికీ స్వస్తి చెప్పి స్థిరచిత్తంతో మేముపదేశించిన దాన్ని మాత్రమే స్వీకరించండి.

"వారిని అల్లాహ్ పంపిన ఆదేశాలను అనుసరించండి అని బోధించి నప్పుడు, వారు – "వీల్లేదు! మా పూర్వులు ఆచరిస్తుండగా మేము చూచిన విధానాన్నే మేము అనుసరిస్తాము"అన్నారు. షైతాన్ వారి

పూర్వీకుల్ని నరకయాతన వైపునకు ఆహ్వానిస్తూ ఉండినప్పటికీ వారు తమ పూర్వీకులనే అనుసరిస్తుంటారా? (కాని) ఎవరయితే తన ఆత్మను, స్వయాన్ని దైవానికి పరిపూర్ణ అర్పణ చేసుకుంటాడో విజాయితీపరుడై, సదాచారుడై జీవిస్తాడో అతడు బలిష్టమయిన ఆధారాన్ని చేపట్టినట్లే – వ్యవహారాలన్నిటి అంతిమ పరిణామం అల్లాహ్ హస్తగతమైనదే (ఈ సందేశాన్ని) తిరస్కరించినవారి తిరస్కారం గూర్చి, ఓ ప్రవక్తా మీరు ఖేదపడనక్కరలేదు. వారంతా మా వైపునకు మరలవలసినవారే. అప్పుడు వారికి వారు చేసినదాని ఫలితాన్ని చూపుతాము." *(లుక్మాన్ : 21-23)*

ఇది మార్గభ్రష్టతకు రెండవ మార్గం.

ఇక మూడవ మార్గాన్ని పవిత్ర ఖుర్ఆన్ ఈ విధంగా సూచించింది. "మనిషి దైవాదేశాన్ని ప్రక్కకు నెట్టివేసి తోటి మానవుల ఆజ్ఞాధికారాన్ని స్వీకరించి వారి ఆజ్ఞల్ని ఆచరించడానికి మొదలెట్టినప్పుడు, ఇంకా ఫలానా వ్యక్తి చాలా గొప్ప వాడు, అతని మాట తప్పక సమంజసమై ఉంటుంది. ఫలానా వ్యక్తి చేతుల్లో నా జీవనోపాధి ఉంది కాబట్టి, అతని మాట అంగీకరించవలసినదే; ఫలానా వ్యక్తి అధికారం కలవాడు కనుక అతని ఆజ్ఞాపాలన చేయవలసిందే; ఫలానా అయ్యగారు అభిశాపం వల్ల నన్ను నాశనం చేయగలరు లేదా తన అనుగ్రహం వల్ల నన్ను స్వర్గానికి కొనిపోగలరు. కనుక వారు ఏది సెలవిస్తే అదే సత్యం; ఫలానా జాతి చాలా వృద్ధి సాధిస్తోంది కనుక, దాని రీతులు, విధానాలే అవలంబించాలి' అని తలంచినప్పుడు మనిషికై దైవం చూపిన బోధనామార్గ ద్వారాలు మూసుకుంటాయి."

"భువిలో ఉన్న చాలా మందిని అనుసరించావంటే, వారు నిన్ను దైవమార్గం నుంచి తొలగించివేస్తారు." *(అల్ అన్ ఆమ్ : 4)*

అంటే, మనిషి ఆరాధించే అల్లాహ్ ఒక్కడయినప్పుడు మాత్రమే అతడు రుజుమార్గాన్ని అనుసరించగలుగుతాడు. వేనవేల 'దేవుళ్ళ'ను సృష్టించుకున్న వ్యక్తి ఒకప్పుడు ఒక దేవుని ఆదేశానుసారంగానూ మరొకప్పుడు ఇంకొక దేవుని ఆజ్ఞప్రకారంగానూ నడుచుకుంటూ సన్మార్గం ఎలా పొందగలడు?

మార్గభ్రష్టతకు ముఖ్యమయిన మార్గాలు మూడు అని ఇప్పుడు మీకు బాగా బోధపడి ఉంటుంది.

ఒకటిః మనోకాంక్షల దాస్యం.

రెండవదిః పూర్వుల, వంశీయుల, తన తెగవాళ్ళ ఆచారాల-దాస్యం.

మూడవదిః లోకంలోని సామాన్య ప్రజల దాస్యం, వీరిలో శ్రీమంతులు, తత్కాల అధికారులు, కాల్పనిక నాయకులూ, మార్గవిహీనులైన జాతులూ అంతా చేరి ఉన్నారు.

ఈ మూడు మహా విగ్రహాలే తమకు దైవత్వం ఉందని ప్రగల్భాలు పలుకుతూ మనకు ఎదురవుతున్నాయి. ఒక వ్యక్తి ముస్లిమ్ అవడానికి ప్రప్రథమంగా ఈ విగ్రహాలు మూడింటిని తునాతునకలు చేయవలసి ఉంటుంది. అప్పుడే అతను వాస్తవంగా ముస్లిమ్ అవగలడు. అలాకాక ఈ మూడు విగ్రహాల్ని తనలో ప్రతిష్ఠింపచేసుకున్న వ్యక్తి అల్లాహ్ దాసుడవడం అసాధ్యం. అతడు దినానికి యాభై పర్యాయాలు నమాజ్ చేసినా, బూటకపు ఉపవాసాలు పాటించినా, ముస్లిముల్లాంటి రూపం దాల్చినా, తాను నిష్ఠగల పరిపూర్ణ ముస్లిమ్‌నని తోటి మానవుల్ని మాత్రం మోసపుచ్చగలడు, ఇంకా స్వయంగాను ఆత్మవంచనకు లోనవగలడు అంతేకాని, అల్లాహ్‌ను మోస గించలేడు.

సోదరులారా! ఇప్పుడు నేను పేర్కొన్న మూడు విగ్రహాల దాస్యమే వాస్తవికమైన షిర్క్ (బహుదైవారాధన). శిలా విగ్రహాలనయితే వదిలివేశారు. ఇటుకా, సున్నములతో కట్టిన విగ్రహాలనయితే కాదన్నారు. కాని అంతః కుహరాలలో వున్న విగ్రహాలయాల పట్ల అంతగా శ్రద్ధ వహించలేదు మీరు. అన్నింటికన్నా అత్యావశ్యకమయినదే కాదు, ముస్లిమవడానికే ప్రప్రథమ షరతు – ఈ విగ్రహాలను రూపుమాపడం, ఒక్క మాట మాత్రం నమ్మండి, ప్రపంచం మొత్తంలోనూ, స్వయంగా భారతదేశంలోను ముస్లిములకు ఇప్పుడు ఎదురవుతున్న కష్ట నష్టాలంతా ఈ 'విగ్రహాల' పూజాఫలమే. ముస్లిముల పతనానికీ, వినాశనానికీ, ఎదురవుతున్న బాధలకూ, ఇంతకు ముందు నేను ప్రస్తావించిన మూడు పీడలే మూలకారణాలు ప్రపంచంలో ముస్లింలు అసంఖ్యాకంగా ఉన్నారు. కాని వారికి ఆదరణ, గౌరవం, అధికారాలు, బహుశః ఎక్కడా ప్రాప్తం కావడం లేదేమో! ఈ దేశంలోను మీ సంఖ్య గణనీయమైనదే. కాని ఇక్కడ మీకు ఎలాంటి విలువ లేదు. కొన్ని అత్యల్ప సంఖ్యాక జాతులకైనా మీకంటే అధికంగా విలువ ఉంది. దీనికి కారణమేమిటో ఎప్పుడయినా ఆలోచించారా మీరు; కారణం ఒక్కటే. మనోకాంక్షల దాస్యం, వంశ ఆచారాల దాస్యం మరియు దైవం తప్ప ఇతర మానవుల దాస్యం – ఇదే మీ శక్తిసామర్థ్యాలను లోలోనే గుల్ల చేసివేసింది.

మీలో రాజపుత్రులున్నారు, మొగలులున్నారు, జాట్‌లున్నారు ఆఫ్ఘనులున్నారు, మరెన్నో జాతులున్నాయి. ఈ జాతులన్నింటినీ ఒక్క జాతిగా, పరస్పరం సోదరులుగా ఇటుకపై ఇటుక సరిగ్గా పేర్చిన గట్టి గోడగా రూపొందమని సూచించింది ఇస్లామ్. కాని మీరు ఇప్పటికీ పూర్వ మూఢ భావాలనే ఆదరిస్తున్నారు. ఇక్కడ ముస్లిమేతరుల్లో ఎలా వేర్వేరు గోత్రాలు ఉన్నాయో అలాగే మీరున్నూ ఇప్పటికీ తెగలు తెగలుగా వేరుపడి ఉన్నారు.

ఈ తెగల్లో పరస్పర వైవాహిక సంబంధాలు లేవు. అన్యోన్యంగా సోదరభావం సానుభూతి లేదు, ముస్లిమ్ సోదరులని, కేవలం నోటితో మాత్రం పరస్పరం అనుకుంటారు మీరు! వాస్తవానికి ఇస్లామ్ కంటే ముందుండిన తారతమ్యాలు విచక్షణాభావాలే నేటికి ప్రబలి ఉన్నాయి. ఒక గట్టి గోడగా మిమ్మల్ని తయారవనివ్వలేదు ఈ భేదభావాలు. మీ ఒక్కొక్క ఇటుక వేరుబడి ఉంది. ఒక్కుమ్మడిగా మీరంతా లేవనూ లేవరు. ఏకమై ఏ ఆపదయినా ఎదుర్కొననూ లేరు. ఇస్లామ్ శిక్షణ ప్రకారం, ఈ భేదభావాల బంధనాలను తెంపి అన్యోన్యంగా ఏకమయిపోవాలి అని అంటే మీరేమంటారు? అదే, ఆ ఒక్క మొండి మాటే కదా మీరిచ్చే జవాబు – 'మా తాత ముత్తాతల నాటి నుంచి సంప్రదాయంలో ఉన్న ఆచారాల్ని మాత్రం విడువలేము' అని అంటారు మీరు. దీనికి దేవుని బదులేమిటో తెలుసా? 'మీ సంప్రదాయాల్ని మీరు విడువకండి, మూఢాచారాల అనుసరణను కాదనకండి. మేమున్నా మిమ్మల్ని ఛిన్నాభిన్నం చేసివేస్తాము. మీరు అధిక సంఖ్యాకులైనప్పటికీ మిమ్మల్ని అతి క్షుద్ర దశకు అణచివేసి చూపిస్తాము' అంటాడు దేవుడు.

మీ వారసత్వంలో మగపిల్లలూ, ఆడపిల్లలూ అందరూ భాగస్వాములే అని అల్లాహ్ ఆదేశించాడు. దీనిపై మీ 'ఆచరణ' ఎలా ఉంది? 'మా పూర్వుల చట్టాల ప్రకారం ఆడపిల్లలకు వారసత్వంలో హక్కులేదు, గనుక దైవాజ్ఞ స్థానంలో పూర్వుల చట్టాల్నే మేము ఆచరిస్తాము.' ఇదీ మీరిచ్చే సమాధానం! దైవ సాక్షిగా చెప్పండి. ఇస్లామ్ అని దీనికేనా పేరు? "ఈ పారంపర్య చట్టాన్ని త్రుంచండి" అని మిమ్మల్ని కోరినప్పుడు "అందరూ వదలినప్పుడే నేనూ వదలిపెడతాను" అని మీలో ప్రతి ఒక్కడూ సమాధానమిస్తాడు. అలా కాక ఇతరులు తమ ఆడ పిల్లలకు భాగమివ్వనప్పుడు నేను మాత్రం భాగం పంచి పెట్టాలంటే నా ఇంటి సంపద ఇతరులకయితే చేరుతుంది కాని మరొకరి

ధనం నా ఇంటికి రాదు కదా! అంటారు మీరు. ఇవీ మీ తీరుతెన్నులు! కాస్త గమనించండి. ఈ సమాధానానికి భావమేమిటి? "ఇతరులు విధేయులయితే తప్ప మేము కాలేము" అనే కదా దాని అర్థం. అయితే ఈ షరతుపైనే దైవాజ్ఞాపాలన చేయబడుతుందా? రేపటికి "ఇతరులు వ్యభిచరిస్తే నేను వ్యభిచారం చేస్తాననీ; ఇతరులు దొంగతనం చేస్తే నేనూ చేస్తాననీ అంటే ఇతరులు పాపపు కార్యాలు వదలిపెట్టనంతవరకు నేను పాపం చేస్తూ ఉంటాను" అని అంటారన్న మాట. అసలు విషయమేమంటే, ఈ విధంగా ఆ మహా విగ్రహాలు మూడింటి ఆరాధన జరుగుతోంది. మనోకాంక్షల దాస్యమూ ఉండి, తాతముత్తాతల దాస్యమూ, ముష్రిక్(బహు దైవారాధకులైన) జాతుల దాస్యమూ జరుగుతోంది. వీటికి తోడుగా ఇస్లామ్ ఉద్ఘోషగా ఉంది!

ఇవి కేవలం రెండే ఉదాహరణలు. కళ్ళు తెరచి చూస్తే మీలో వ్యాపించిన రుగ్మతలు ఇలాంటివే అగణ్యంగా కనిపిస్తాయి. వీటన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలిస్తే ఒక్కోచోట ఏ ఒక్క విగ్రహమో ఆరాదింపబడుతూ ఉంటే మరొకచోట మూడింటి ఆరాధన జరుగుతూ ఉన్నట్లు తేటతెల్లమవుతుంది. ఒక వైపు ఈ 'విగ్రహ' పూజ జరుపుతూ; దీనికి తోడుగా ఇస్లామ్ ఉద్ఘోషణ కూడా చేస్తూ ఉండే నిజమయిన ముస్లిముల ఎడల దైవం చేసిన వాగ్దానంలోని కానుకలు, కరుణానుగ్రహాల వర్షం మీపై కురుస్తుందని మీరు ఎలా ఆశించగలరు?

★★★

# విశ్వాసానికి గీటురాయి

ముస్లిమ్ సోదరులారా! ఖుర్‌ఆన్ ఆదేశానుసారం మానవుని మార్గ విహీనతకు మూలకారణాలు మూడని గత జుమా ఖుత్‌బాలో వివరించాను. మొదటిది, మనిషి దైవ శాసనాన్ని వదలిపెట్టి తన మనోకాంక్షల దాసుడయిపోవడం; రెండవది దైవాజ్ఞలకు ప్రతికూలంగా తన వంశంలోని ఆచార వ్యవహారాలకూ తాతముత్తాతల నాటి రీతులకు ప్రాముఖ్యత ఇవ్వడం; మూడవది, దైవమూ మరియు దైవసందేశహరుడు చూపిన విధానాన్ని అడుగునవేసి తోటి మానవులనో లేక ఇతర జాతుల వారినో అనుసరించడం.

"ముస్లిమ్" యొక్క నిజమయిన నిర్వచనం ఏమంటే, అతను ఈ మూఢ వ్యాధులకు లోనవ్వక పవిత్రంగా ఉండాలి. ముస్లిమనే పిలుపుకు భావమేమంటే, మనిషి దైవానికి తప్ప దాసుడు మరొకరికి కాకూడదు. ప్రవక్త తప్ప మరొకరిని అనుసరించకూడదు. దైవం మరియు ఆయన ప్రవక్త శిక్షణలే పరిపూర్ణంగా పరమ సత్యమయినవనీ వీటికి భిన్నమయినదంతా అసత్యమనీ, మానవునికి లభించే ఇహపరాల శుభమంతా కేవలం దైవం, ఆయన ప్రవక్త శిక్షణల్లోనే ఉందనీ హృదయ పూర్వకంగా, దృఢంగా విశ్వ

సించే వ్యక్తియే ముస్లిమ్. ఈ విషయాల్లో ప్రగాఢ విశ్వాసం ఎవనికయితే ఉందో అతను తన జీవితపు ప్రతి వ్యవహారాల్లోనూ దైవం, ఆయన సందేశ హరుని ఆజ్ఞనే అన్వేషిస్తాడు. అతనికి ఆజ్ఞ తెలిసిపోయిందంటే మారు పలకక దాన్ని శిరసావహిస్తాడు, ఆ తరువాత అతని మనసు ఎంతగా కలవరపరచినా, వంశంలోనివారు ఎన్ని చెప్పినా, లోకులు ఎంతగా వ్యతిరేకించినా, అతను ఎవ్వరినీ ఖాతరు చెయ్యడు. ఎందుకంటే ప్రతి ఒక్కరికీ సమాధానం ఒక్కటే, "నేను దేవుని దాసుణ్ణే కాని మీ దాసుణ్ణి కాను, నేను విశ్వసించింది ప్రవక్తనే కాని మిమ్మల్ని కాదు."

దీనికి భిన్నంగా "ఫలానా ఆదేశం దైవం మరియు ఆయన ప్రవక్తదే అయినా కానివ్వండి, నా మనస్సు మాత్రం సమ్మతించడం లేదు. దీనిలో నాకు నష్టం కనబడుతోంది గనుక నేను దైవం మరియు ప్రవక్త ఆదేశాన్ని వదలి సొంత అభిప్రాయాన్నే అనుసరిస్తాను" అని ఎవరయినా అంటే అతని అంతర్యం విశ్వాస శూన్యమయింది, అతను మోమిన్(విశ్వాసి) కాజాలడు, అతడు మునాఫిక్(కపటి) అవడంలో సందేహం లేదు. నోటితోనయితే "నేను దేవుని దాసుణ్ణి. ప్రవక్త అనుచరుణ్ణి" అనంటాడు. కానీ వాస్తవానికి అతను తన మనస్సుకే దాసుడు, అభిప్రాయాల అనుచరుడు.

ఇలాగే, దైవం ఆయన ప్రవక్త ఆజ్ఞ ఏదైనా ఒక ఆచారం తాతముత్తాతల నాటి నుండి జరుగుతూ వస్తోంది. దాన్ని వదలడం ఎలా? లేక ఫలానా నియమం మా వంశంలో, మా తెగలో సంప్రదాయకంగావస్తోంది. దాన్ని ఎలా విఘ్నం చేయగలం? అని అనే వ్యక్తి కూడా కపటాచారిగా పరిగణింప బడతాడు. నమాజ్ చేస్తూ అతని నుదుటిపై పెద్ద కాయ కాసినా, బాహ్యంలో అతను ఎలాంటి నిష్ఠాపరాయణతను వెలిబుచ్చినా సరే! ఎందుకంటే దీన్ యొక్క నిజ సారం అతని మనస్సుకు ఎక్కనే లేదు. 'రుకూ', సజ్దాలను

(ప్రార్థనాంశాలు), రోజా (ఉపవాసవ్రతం), హజ్‌లను మాత్రమే దీన్ అని అనరు. దీన్ అన్నది మనిషి స్వరూపంలోనూ, వస్త్రధారణలోనూ ఉండదు. యదార్థానికి దైవం మరియు ఆయన ప్రవక్త యొక్క విధేయతకే దీన్ అని పేరు. ఎవరయితే తమ వ్యవహారాల్లో దైవం, ఆయన ప్రవక్త విధేయతను తిరస్కరిస్తారో వారి అంతర్యంలో వాస్తవానికి దీన్ ప్రవేశించలేదని చెప్పాలి. అలాంటివారి నమాజ్(ప్రార్థన), రోజా(ఉపవాస వ్రతం) నిష్ఠాపరాయణతను చాటే రూపం అంతా ఒక కపట నాటకం తప్ప ఏదీ కాదు.

ఇదే విధంగా ఒక వ్యక్తి దైవ గ్రంథమూ, దైవ ప్రవక్త ఆదేశాన్నీ నిర్లక్ష్య పరచి, ఒక విషయం ఆంగ్లేయుల రివాజులో ఉన్నందువల్ల దాన్ని అవలంబించాలనీ లేక ఒక విషయం మూలాన ఫలానా జాతి అభివృద్ధిని సాధిస్తోంది కనుక దాన్ని స్వీకరించాలనీ లేక ఫలానా పెద్ద మనిషి ఒక మాటను సెలవిస్తున్నారు కాబట్టి అంగీకరించాలనీ చెప్పే మహాశయుడు సహితం తన ఈమాన్ (విశ్వాసం) కొరకు వగచేకన్నా గత్యంతరం లేదు. ఇలాంటి భావాలు ఈమాన్‌తో జతపడవు. ముస్లిమవడానికి, ముస్లిమ్‌గా ఉండడానికి మీరు ఇష్టపడితే దైవం మరియు ప్రవక్త ఆదేశాలకు భిన్నమయిన ప్రతి మాటను నేలకు గిరవాటు వెయ్యండి. మీరు ఇలా చేయలేకపోయారా - ఇస్లామ్ స్వీకరించినట్లు చేసే ఉద్ఘోషణ మీకు శోభించదు. మేము దైవాన్ని ప్రవక్తను విశ్వసిస్తున్నామని నోటితో అనడం, ఆ తరువాత జీవిత వ్యవహారాలన్నింటిలో ఇతరుల సలహాలు పాటిస్తూ దైవం మరియు ప్రవక్త ఆదేశాలను తిరస్కరిస్తూ ఉండటం ఈమాన్ కాదు, ఇస్లామ్ కూడా కాదు. దీనికి మునాఫికత్(కపటాచారం) అని పేరు.

దివ్య ఖుర్ఆన్‌లోని పద్దెనిమిదవ కాండంలో అల్లాహ్ అతి స్పష్టంగా సెలవిచ్చాడుః

"మేము సత్యాన్ని అసత్యాన్ని విడమర్చి చూపే వచనాలను అతి స్పష్టంగా అవతరింపజేశాము. ఈ ఆయతుల ద్వారా అల్లాహ్ తాను తలచినవారికి సన్మార్గాన్ని చూపుతాడు. 'మేము అల్లాహ్‌ను, ప్రవక్తను విశ్వసించామనీ, (వారి) విధేయత స్వీకరించా'మని అంటారు జనులు. ఆ తరువాత వీరిలోని కొందరు విధేయతకు విముఖులవుతారు. ఇలాంటివారు విశ్వాసులు కారు. వీరి వ్యవహారాల్లో దైవ శాసనానుసారం తీర్మానం చేయడానికి అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (ఆదేశం) వైపునకు వీరిని పిలిచినప్పుడు వీరిలోని కొందరు వ్యక్తులు తప్పుకుంటారు, అయితే వారి అభిమతానికి సరిపోయే విషయమయితే మాత్రం దాన్ని అంగీకరిస్తారు. వీరి అంతర్యాల్లో ఏదయినా వ్యాధి తిష్ఠవేసిందా? లేక వీరు సంశయంలో పడి కొట్టుకుంటున్నారా? లేక అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త వీరి హక్కులను కాజేస్తారనే భీతి వీరిని పీడిస్తోందా? ఇంతకూ కారణమేమైనా వీరు చేజేతులా తమపైనే అత్యాచారం చేసుకుంటున్నారు.

"వ్యవహారాలలో దైవశాసనానుసారంగా తీర్పు చేయడానికి అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త సమక్షానికి పిలిచినపుడు యదార్థంగా విశ్వాసులయినవారు ఇలా అంటారు. 'మేము విన్నాము, విధేయులమయ్యాము'. ఇలాంటి వారే సఫలతను పొందేవారు. ఎవడైతే అల్లాహ్, ఆయన ప్రవక్తకు విధేయుడై అల్లాహ్‌కు భయపడుతూ, ఆయన ఆజ్ఞోల్లంఘనకు దూరంగా మసలుకుంటాడో అతడే సాఫల్యం పొందేవాడు." (నూర్ : 46-52)

ఈ వాక్యాలలో (ఆయతులలో) విశ్వాసం ఎలా నిర్వచింపబడిందో కాస్త గమనించండి. అసలయిన విశ్వాసమేదంటే దైవ గ్రంథం మరియు దైవ

ప్రవక్త యొక్క మార్గదర్శకత్వానికి స్వయం సమర్పణ చేసుకోవాలి. అటు నుండి లభించే ఆజ్ఞను శిరసావహించాలి. దానికి భిన్నమైనదాన్ని దేనినీ వినకూడదు. అది తన మనస్సులోని కోరిక అయినా, వంశంలో వచ్చే ఆచారమయినా లేక ప్రపంచంలోని మరెవరి ఆదేశమైనా సరే. ఎవరి ఆంతర్యం ఇలా పరివర్తన చెందుతుందో అతనే మోమిన్, అతనే ముస్లిమ్, ఇలా కాని వ్యక్తి మనోస్థితి ఒక మునాఫిక్(కపటి) స్థితి కంటే వేరు కాజాలదు.

అరబ్ దేశంలో మద్యపాన సేవనం ఎంత విస్తృతంగా జరిగేదో మీరు వినే ఉంటారు. స్త్రీ, పురుషులు, వయోవృద్ధులు, అందరూ సారా వెర్రెక్కినవారే. నిజానికి మద్యపానమంటే వారికి అమితమైన మక్కువ. దాని పొగడ్తలు గానం చేసేవారు. దాన్ని ప్రాణప్రదంగా ప్రేమించేవారు. దాని జాడ్యం అంటుకున్నదంటే వదలడం ఎంత కష్టసాధ్యమో అదీ మీకు తెలిసిన విషయమే. మనిషి ప్రాణాలనయినా త్యాగం చేయటానికి సిద్ధపడతాడు కాని దాన్ని ఒదలడమంటే ఒప్పుకోడు. త్రాగుబోతుకు, సారాయి లభించకపోతే రోగికంటే అధోగతికి లోనవుతాడు. కాని దివ్య ఖుర్‌ఆన్‌లో మద్యపానాన్ని నిషేధిస్తూ ఆదేశాలు వచ్చినపుడు ఏం జరిగిందో మీరెప్పుడైనా విన్నారా? సారాయిని ప్రాణప్రదంగా ప్రేమించే ఆ అరబ్బులే ఈ ఆజ్ఞలు వినగానే చేతులారా సారాయి పాత్రలను పగులగొట్టారు. మదీనా నగర వీధుల్లో వర్షపు నీటిలా ప్రవహించింది ఆనాటి సారాయి. ఒక చోట కొందరు కూర్చుని సారాయి సేవిస్తూ ఉంటారు; సారాయి నిషేధింపబడినట్లు దైవ సందేశహరుల (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రకటన వినగానే ఎక్కడివారక్కడే ఆగిపోతారు. ఎవరి నోటి దగ్గర మధు పాత్ర ఉన్నదో వారు తక్షణం దాన్ని తీసివేశారు. తదనంతరం ఒక్క బొట్టయినా కంఠంలో దిగలేదు. ఇదీ విశ్వాసములోని ఘనత! దీన్నే అంటారు దైవం, ప్రవక్తల విధేయత అని!

ఇస్లామ్‌లో వ్యభిచారానికి ఎంత కఠినమైన శిక్ష విధించబడుతుందో మీకు బాగా తెలుసు. వీపుపై నూరు కొరడా దెబ్బలు; దాని తలంపే గగుర్పాటు పుట్టిస్తుంది. వివాహితుడయిన వ్యక్తినయితే అతనిపై రాళ్ళు రువ్వడం అంటే ఆ వ్యక్తి మరణించే వరకూ రాళ్ళు రువ్వడం అన్నమాట. ఇలాంటి కఠిన శిక్ష పేరు వింటేనే మనిషి కంపించిపోతాడు. కాని అంతర్యంలో విశ్వాసమున్నవారి పరిస్థితి ఎలా ఉందో మీరు విన్నారా? ఒక వ్యక్తి చేత వ్యభిచారం జరిగిపోతుంది. దానికి సాక్షులెవ్వరూ లేరు. న్యాయస్థానం వరకు అతణ్ణి పట్టుకెళ్ళేవారెవరూ లేరు. పోలీసులకు తెలిపేవారు లేరు. అంతర్యంలో విశ్వాసం మాత్రం సజీవంగా ఉంది - "నీవు దైవ శాసనానికి విరుద్ధంగా నీ మనోకాంక్షను నెరవేర్చుకున్నావు. అయితే ఈ క్రియకు దైవం నిర్ణయించిన శిక్ష అనుభవించడానికి కూడా సిద్ధమవాలి!" ఆదేశించింది అతనిలోని విశ్వాసం. ఆ వ్యక్తి స్వయంగా మహా ప్రవక్త ముహమ్మద్(సఅసం) సన్నిధిలో హాజరవుతాడు. ఇలా నివేదించుకుంటాడు, "ఓ మహాప్రవక్తా! నేను వ్యభిచరించాను. నన్ను శిక్షించండి." ఆయన (సఅసం) ముఖం త్రిప్పుకుంటారు! అతను అటు ప్రక్కకు వచ్చి అలాగే విన్నవించుకుంటాడు. "నేను చేసిన పాపానికై నన్ను శిక్షించాలి" అంటూ. ఇదీ విశ్వాసమంటే! అంతర్యంలో విశ్వాసం ఉన్నవారికి వీపుపై నూరు కొరడా దెబ్బలే కాదు, రాళ్ళతో చంపబడటమూ సులువే కాని, దేవుని సమక్షంలో అవిధేయుడుగా, ధిక్కారిగా హాజరవడం కష్టం!

ప్రపంచంలో మనిషికి తన బంధువులకంటే ప్రేమ పాత్రులు ఎవరూ ఉండరన్న సాధారణ విషయం మీరెరిగినదే. ముఖ్యంగా, తండ్రినీ, సోదరుల్నీ, సంతానాన్నీ ప్రాణ సమానంగా భావిస్తాడు మనిషి. వారికై సర్వమూ త్యాగం చేయడానికి సిద్ధమవుతాడు. కాని, బద్ర్, ఉహుద్ యుద్ధ

వివరాలను కాస్త శ్రద్ధగా పరిశీలించండి. అందులో ఎవరు ఎవరికి ఎదురుగా పోరాడారు? తండ్రి ముస్లిముల సైన్యములో ఉంటే కొడుకు తిరస్కారుల సైన్యంలో లేదా కొడుకు ఈ పక్షాన ఉంటే మరొకతను ఎదుట రంగంలో, దగ్గర బంధువులు ఒకరినొకరు ఎదురు నిలిచి పోరాడటానికి సమాయత్తమయ్యారు. ఒకరినొకరు ఎన్నడూ ఎరుగనంతటి వైరంతో పోరాడారు. ఈ ఉద్రేకం వారిలో ఏదో డబ్బు దస్కాల కోసం ఉత్పన్నం కాలేదు. వారిలో పరస్పర వ్యక్తిగత వైషమ్యం, శతృత్వం కూడా లేదు. అయినా వారు తమ స్వంత రక్తమాంసాలకు వ్యతిరేకంగా ఆత్మీయులతో పోరాడటానికి కారణం కేవలం ఒక్కటే. దైవం మరియు ఆయన ప్రవక్త కొరకు స్వయంగా తమ తండ్రినీ, కొడుకునూ, సోదరుల్నీ ఇంకా తమ వంశం యావత్తునూ కూలద్రోసే త్యాగసంపన్నులన్న మాట వారు!

అరబ్బు దేశంలో ఆనాడు ప్రబలి ఉన్న పురాతన ఆచారాల్ని ఇంచుమించుగా అన్నింటినీ ఇస్లామ్ రూపుమాపిందన్న విషయమూ మీకు తెలిసినదే. అన్నింటికంటే అధికమయింది విగ్రహారాధనే. శతాబ్దాల తరబడి అది ఆచారంలో ఉంటూ వచ్చింది. ఇస్లామ్, విగ్రహాలకు స్వస్తి చెప్పమని ఆదేశించింది. మద్యపానం, వ్యభిచారం, జూదం, దొంగతనం, దోపిడీ అరబ్ దేశంలో సర్వసామాన్యమయినవి. వాటినన్నింటినీ త్యజించాలని కోరింది. అరబ్ స్త్రీలు విచ్చలవిడిగా తిరిగేవారు. ఇస్లామ్ పరదాను ఆదేశించింది. అరబ్బులు స్త్రీలకు వారసత్వంలో వాటా ఇచ్చేవారు కాదు, స్త్రీలకు వారసత్వంలో భాగముందని ఇస్లామ్ చాటింది. క్రితంలో పెంపుడు పుత్రులకు స్వంత సంతానికి సమంగా స్థానమివ్వబడేది. ఇస్లామ్ అది కాదన్నది. అంతే కాదు పెంపుడు కొడుకు తన భార్యకు విడాకులిస్తే ఆమెను వివాహం చేసుకోవడమూ ధర్మ సమ్మతమయినదే అని చాటించింది. మొత్తానికి

పరిత్యజించాలని ఆదేశించని పురాతన ఆచారమంటూ లేదు. కాని దైవం, ఆయన ప్రవక్తను నమ్మినవారి వైఖరి ఎలాగుండేదో మీకేమయినా తెలుసా? శతాబ్దాల తరబడి వారూ వారి పూర్వులు ఏ విగ్రహాల ముందు మోకరిల్లేవారో, తమ నోములు సమర్పించుకునేవారో వాటిని ఈ విశ్వాసులు తమ చేతులారా విరగ్గొట్టారు. శతాబ్దాల తరబడి రివాజులో ఉంటూ వచ్చిన వంశ ఆచారాలన్నిటినీ ఒకపట్టున వదులుకున్నారు. వారు పరమ పవిత్రములని తలుస్తూ వచ్చిన వాటినన్నిటిని దైవాజ్ఞ కాగానే కాలరాచారు. ఏ వస్తువుల పట్ల వారు ఏహ్యపడేవారో దైవాజ్ఞ రాగానే వాటినే ధర్మసమ్మతమైనవాటిగా పరిగణించారు. శతాబ్దాల తరబడి పరిశుద్ధములుగా భావింపబడినవన్నీ ఒక్కసారిగా అపరిశుద్ధములయిపోయాయి. రుచిగొలిపే, లాభాన్నిచ్చే అవిశ్వాసపు విధానాలన్నింటినీ దైవాజ్ఞ రాగానే విడిచి పెట్టారు. భారమనిపించే ఇస్లామ్ విధానాలనన్నిటినీ అమిత ఆనందంతో స్వీకరించారు. ఇదీ విశ్వాసమంటే - ఇదే ఇస్లామ్ అంటేనూ! ఒక విషయంలో నష్టం కలుగుతుంది గనుక, మేము దాన్ని అంగీకరించమనీ మరొక విషయంలో స్వలాభముంది కాబట్టి దాన్ని విడువమనీ మరొక కార్యమయితే తప్పక చేస్తాము, ఎందుకంటే మా పూర్వుల నుండి ఇదే జరుగుతూ వస్తుందనీ, రోము దేశస్థుల ఆచారమొకటి మాకు ఇష్టమయినదనీ, ఇంకా ఈరాన్ దేశస్థులు ఫలానా విషయమే మాకు ప్రాణప్రదమైందనీ అంటూ ఇస్లామ్ ఆదేశించిన ఒక్కొక్క నియమాన్నే అరబ్ ప్రజలు ఆనాడు తిరస్కరించివుంటే, నేడు లోకంలో ముస్లిమన బడేవాడు ఒక్కడూ ఉండేవాడుకాడని మీరు ఇట్టే గ్రహించగలరు.

సహోదరులారా! దివ్య ఖుర్ఆన్‌లో ఈ విధంగా సెలవీయబడింది:

**"మీకు ప్రియతమమైన వాటినన్నింటినీ దేవునికై త్యాగం చేయనంతవరకు 'మంచి' అన్నది మీకు ప్రాప్తం కాదు."**

ఈ ఆయతే ఇస్లామ్ మరియు విశ్వాసాల మూలాంశం. మీకు ప్రియమైన వస్తువులను దైవానికై త్యజించడంలోనే మీ ఇస్లామ్ ఘనత ఇమిడివుంది. జీవిత వ్యవహారాలన్నిటిలో ఇస్లామ్ ఘనత ఇమిడివుంది. జీవిత వ్యవహారాలన్నిటిలో దైవాజ్ఞ ఒక వైపునకు పిలుస్తే మనోకాంక్షలు మరో వైపునకు ఆహ్వానిస్తాయి. దైవం ఒక కార్యం చేయమని ఆజ్ఞాపిస్తే అందులో కష్టం కలుగుతుంది లేక నష్టం సంభవిస్తుందని భయపడుతుంది మనస్సు. దైవం ఒకదాన్ని నిషేధిస్తే, ఇది చాలా స్వాదిష్టమయిందని, అమిత లాభదాయక మయిందని మభ్యపెడుతుంది మనస్సు. ఒక పక్షాన దైవ ప్రసన్నత ఉంటే, ప్రపంచం మొత్తమే ఎదురవుతుంది. మరో పక్షంలో, అంటే జీవితంలో అడుగడుక్కు మనిషికి రెండు మార్గాలు ఎదురవుతూ ఉంటాయి. ఒకటి ఇస్లామ్ మార్గం, మరొకటి తిరస్కార మార్గం, కపటపుబాట. ప్రపంచపు ప్రతి వస్తువునూ కాలదన్ని దైవాజ్ఞను శిరసావహించిన వ్యక్తి ఇస్లామ్ మార్గాన్ని అవలంబించినవాడునూ, దైవాజ్ఞను కాదని తన మనోకాంక్షనో లేక అభిరుచినో పాటించే వ్యక్తి, కుఫ్ర్ (తిరస్కార) మార్గాన్నో నిఫాక్ (కపటపు) బాటనో అనుసరించినవాడవుతాడు.

ప్రస్తుతం జనుల పరిస్థితి ఏమిటంటే, ఇస్లామ్‌లో సులువైన విషయాన్నయితే మహదానందంతో స్వీకరిస్తారు. కాని కుఫ్ర్, ఇస్లామ్‌లు వాస్తవంగా ముఖాముఖిన ఆసన్నమయిన క్షణమే విముఖంగా ప్రవర్తించి దిశ మార్చుకుంటారు, గొప్ప "ఇస్లామ్ ఉద్ఘోషకుల" లోనూ ఈ బలహీనత గోచరిస్తోంది. వారు ఇస్లామ్ ఇస్లామ్ అంటూ చాలా నినాదాలు చేస్తారు. దాని పొగడ్తలతో వారి నోరే శుష్కించిపోతుంది. ఇస్లామ్ కొరకు కొన్ని ప్రదర్శక కార్యాలూ జేస్తారు. కాని వారితో – 'మీరంత ఘనంగా పొగడే ఇస్లామ్ శాసనా లను స్వయంగా మనపైనే జారీ చేసుకుందాం. ముందుకు రండి' అని

ఆహ్వానిస్తే, మరుక్షణమే, "ఇందులో ఫలానా ఇక్కట్లు అవాంతరాలున్నాయి; ప్రస్తుతానికయితే దీన్ని మాత్రం అలా ఉండనిస్తారూ?" అనంటారు. అంటే, 'ఇస్లామ్ అనేది ఒక అందమయిన ఆట బొమ్మ. దాన్ని అటకపై అమర్చి అతి దూరంగా ఆసీనులయి అహర్నిశలూ స్తోత్రములు గానం చెయ్యండి. కాని దీన్ని స్వయంగా తమపై, తమ ఇంటివారిపై, బంధుమిత్రులపై, తమ కార్య కలాపాలపై, వ్యవహారాలపై ఒక శాసన రూపంలో అమలుజరిపే విషయం మాత్రం నామమాత్రానికయినా నోటికి రానివ్వకండి' అని భావం. ఇదీ మన ఆధునిక నిష్ఠాపరుల వైఖరి, ఇక ప్రాపంచికుల విషయం చెప్పనక్కరలేదు. దీని పర్యవసానమే నేడు నమాజ్‌లో ఒకప్పుడుండిన ప్రభావం కానరావడం లేదు; రోజాలలో వాటి సత్ఫలితం వ్యక్తం కావడం లేదు; ఖుర్‌ఆన్ పఠనం లోను, షరీఅత్ (శాసనాంగం)ను పాటించడంలోనూ వాటి ప్రభావం అగుపడదు. కారణమేమంటే, జీవమే లేనప్పుడు కళేబరం ఏ మహిమలను ప్రదర్శిస్తుంది.

★★★

# దైవవిధేయత దేనికి?

ముస్లిమ్ సోదరులారా! వెనుకటి కొన్ని ప్రసంగాలలో మీ ముందు ఒకే విషయాన్ని మరీ మరీ వివరిస్తున్నాను, అల్లాహ్ ఆయన ప్రవక్త (సఅసం) యొక్క విధేయతకే "ఇస్లామ్" అని పేరు. తన కాంక్షలకూ, ఆచార సంప్రదాయాలకు, లోకంలోని ఇతర వ్యక్తులకు మరే ఒక్కదానికీ శిరసా వహించకుండా అల్లాహ్, ఆయన ప్రవక్త యొక్క విధేయతను పాటించనంత వరకు వ్యక్తి "ముస్లిమ్" అవడమే అసాధ్యం.

అల్లాహ్, ఆయన ప్రవక్త యొక్క విధేయతను అంతగా నొక్కి చెప్పడమూ, ప్రాముఖ్యత ఇవ్వటమూ దేనికనే విషయాన్ని నేడు మీ ముందు విశదీకరించదలిచాను, దేవుడు మన విధేయతకై మొగం వాచి ఉన్నాడా? తత్కారణంగా ఆయన తనకూ మరియు తన ప్రవక్తకూ విధేయత చెల్లించమని కోరుతున్నాడా? ప్రాపంచిక అధికారులవలె తన ప్రభుత్వాన్ని నడిపించే అధికార పిపాసకు లోనై ఉన్నాడా? అందుకే ప్రాపంచిక అధికారులు "మా ఆజ్ఞల్ని పాటించాలి" అని వాంఛించినట్లే

దేవుడు కూడా తన ఆజ్ఞల్ని పాటించవలసిందిగా కోరుతున్నాడా? (దైవం మన్నించుగాక) వీటి సమాధానమే నేడు మీకు ఇవ్వదలిచాను.

వాస్తవమేమంటే, అల్లాహ్ మనిషిని కోరేదంతా మనిషి శ్రేయం, సాఫల్యాల కొరకే. ఆయనకూ ప్రాపంచిక అధికారులకూ పోలిక లేదు. ప్రాపంచిక అధికారులు స్వలాభాల కోసం జనుల్ని తమ ఇష్టానికి బానిసలుగా చేసుకుంటారు. కాని దైవం స్వప్రయోజనాలన్నింటికీ అతీతుడు. మన వద్ద నుంచి పన్నులు వసూలు చేసే అగత్యం ఆయనకు లేదు. భవంతులు నిర్మించి కార్లు కొని, మీ సంపాదనతో తన విలాస సామగ్రిని సమకూర్చుకునే అక్కర ఆయనకు లేదు. ఆయన పరిశుద్ధమయినవాడు, నిష్కామి, అవసరాలకూ, అక్కరలకూ అతీతుడు. ప్రపంచంలోని సర్వమూ ఆయనదే. ధనాగారాలన్నిటికీ ఆయనే అధిపతి. మీ శ్రేయమే ఆయనకు వాంఛనీయం, గనుక ఆయన మిమ్మల్ని తనకు విధేయులై ఉండమని కోరుతాడు. సృష్టి శ్రేష్ఠంగా తాను పుట్టించిన సృష్టి, మానవుడు, షైతాన్ లేక ఇతర మానవులకు బానిస అయివుండటమో లేదా తుచ్ఛమయినవాటికి తల ఒగ్గి ఉండటమో ఆయన సుతరామూ సమ్మతించడు. తన ప్రాతినిధ్యం ప్రసాదించి, తాను భువిపై పంపిన సృష్టి అజ్ఞానపు అంధకారాల్లో తట్టాడుకుంటూ ఉండటమో, జంతువుల వలె వాంఛల దాస్యం చేసుకుంటూ పాతాళానికి దిగజారిపోవడమూ ఆయన సహించడు. అందుకే, "నా విధేయులయి ఉండండి, నా ప్రవక్తల ద్వారా నేను పంపిన కాంతిలో జీవితం గడపండి. అప్పుడు మీకు ఋజు మార్గం ప్రాప్తమవుతుంది. ఆ మార్గాన్ని అనుసరించి మీరు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ గౌరవం, ఔన్నత్యం పొందగలరు" అని ఆదేశిస్తాడు. ఇంకా:

> **"దీన్‌లో ఎలాంటి బలాత్కారం లేదు. సదాచారపు సన్మార్గం మూర్ఖత్వపు వక్రమార్గాల నుంచి వేరుపరచి తేటతెల్లంగా చూపడమయినది. ఇక**

మీలో ఎవడయితే మిథ్యా దేవుళ్ళను భ్రష్టకారులయిన స్వాములను పరిత్యజించి అల్లాహ్ ఒక్కడినే విశ్వసిస్తాడో అతడు ఎన్నటికీ తెగనటువంటి దృఢమయిన త్రాటి ఆధారాన్ని చేపట్టినవాడవుతాడు, అల్లాహ్ సర్వమూ ఆలకించగలడు. ఆయన సర్వాంతర జ్ఞాని. అల్లాహ్ విశ్వసించినవారి సంరక్షకుడు. ఆయన వారిని అంధకారాల్లో నుంచి వెలుపలికి తీసి దేదీప్యమానమైన కాంతులలో ప్రవేశపెడతాడు. అయితే దైవధిక్కారాన్ని అవలంబించినవారి సంరక్షకులు, వారి మిథ్యా దేవుళ్ళూ, భ్రష్టకారులయిన స్వాములు, వారు అవిశ్వాసులను వెలుగు నుంచి కారుచీకట్లలోనికి తీసుకుపోతారు. వీరంతా నరకవాసులు అదే వారి చిర నివాసము."

(అల్ బఖరా : 256, 257)

ఇక అల్లాహ్ తప్ప ఇతరుల విధేయత వల్ల మనిషి అంధకారంలో ఎలా ప్రవేశిస్తాడో మరియు అల్లాహ్ విధేయత వల్లనే కాంతి లభిస్తుందనడానికి కారణమేమిటో గమనించండి.

ప్రపంచంలో మీ జీవితం ఎన్నో సంబంధాల్లో పట్టుబడి ఉందన్న విషయం మీరెరిగినదే! ప్రప్రథమ సంబంధం మీ శరీరంలోనే ఉంది. ఈ కాళ్ళు చేతులు, కళ్ళూ చెవులు, నోరు, కడుపు, మనోమస్తిష్కాలు, అవయవాలన్నీ మీ సేవ కొరకే ప్రసాదించాడు అల్లాహ్. వీటిని ఎలా ఉపయోగించుకోవాలో మీరు నిర్ణయించుకోవలసి ఉంది. కడుపుకు ఎలాంటి భోజనం పెట్టాలి, ఏది పెట్టరాదు, చేతులతో ఏ కార్యం చెయ్యాలి, దేనిని చేయకూడదు; కాళ్ళను ఏ బాటపై నడిపించాలి, దేనిపై అడుగుపెట్టరాదు; కళ్ళూ చెవులతో, ఎలాంటి సేవ చేయించుకోవాలి. ఏది కూడదు; నోటిని ఎలాంటి మాటలకై ఉపయోగించాలి; మనోమస్తిష్కాలలో ఎలాంటి తలపులు

భావాలకు చోటివ్వాలి? ఈ సేవకులచేత మీరు సత్కార్యాలు చేయించుకోగలరు. దుష్కార్యాలు చేయించుకోవడమూ సాధ్యమే. ఇవి మిమ్మల్ని ఒక ఉన్నతమయిన వ్యక్తిగానూ రూపొందించగలవు. పశువు కన్నా అధమమయిన దశకూ త్రోయగలవు.

మీ సంబంధాలు మీ కుటుంబంతో కూడా ఉన్నాయి. తల్లిదండ్రులు, సోదరీ సోదరులు, భార్యాబిడ్డలు తదితర బంధువులు మీకు అహర్నిశలు తటస్థపడుతూ ఉంటారు. వారితో ఎలా ప్రవర్తించాలి? వారి యెడల మీ బాధ్యతలేవీ? అన్న విషయాలను మీరు నిర్ణయించవలసి ఉంటుంది. వీరితో సముచితంగా వ్యవహరించడంలోనే మీ ఇహపర జీవితాల సౌఖ్యమూ, ఆనందమూ, సౌభాగ్యమూ ఆధారపడి ఉన్నాయి. తప్పుగా, అనుచితంగా ప్రవర్తించారా ప్రపంచం మీకై నరక తుల్యమయిపోతుంది. ప్రపంచంలోనే కాదు, ఆఖిరత్ చిర జీవితంలోనూ దేవుని సమక్షంలో అతి క్లిష్టమయిన ప్రశ్నలకు జవాబు ఇవ్వడానికి బాధ్యులవుతారు.

మీ సంబంధాలు ప్రపంచంలోని అసంఖ్యాక జనులతో కూడా ఉన్నాయి. కొందరు మీ పొరుగువారు, కొందరు మీ మిత్రులయితే మరి కొందరు శత్రువులు, ఎంతో మంది మీ సేవ చేసేవారుండగా, ఇంకా ఎంతో మందికి మీరు కూడా సేవ చేయవలసి ఉంటుంది. మరెందరితోనో లావాదేవీలు ఉంటాయి. ఒకడు మిమ్మల్ని నమ్మి తన పనుల్ని మీకు అప్పగిస్తాడు. మరొకరిని నమ్మి మీరు మీ పనులు అప్పగించవలసి ఉంటుంది. ఎవరయినా మీపై అధికారులయితే మీరూ ఒకరిపై అధికారులే. ఈ విధంగా రేయింబవళ్ళలో మీకు ఎంతో మంది ఏదో ఒక వ్యవహారంలో తటస్థపడుతూనే ఉంటారు, వీరిని మీరు లెక్కించలేరు. ప్రపంచంలో మీరు సఫలత ఆనందం, గౌరవ ఖ్యాతులన్నీ ఈ సంబంధాలు సక్రమంగా, సవ్యంగా ఉండటంపైనే

ఆధారపడి ఉన్నాయి. ఇదే విధంగా పరలోకంలో మీరు మీ ప్రభువు సన్నిధిలో హాజరు అయినప్పుడు మీకు సాఫల్యం లభించాలంటే మీరు ఒకరి హక్కును కాజేసి, ఒకరిపై దౌర్జన్యం చేసి ఉండకూడదు. మీకు ప్రతికూలంగా ఎలాంటి నేరారోపణ ఉండరాదు. ఒకరి జీవితాన్ని నాశనం చేసిన పాతకం, ఒకరి ధన మాన ప్రాణాలను అధర్మంగా మీరు నష్టపరచిన దోషం మీపై ఉండకూడదు. కనుక అసంఖ్యాకమైన ఈ సంబంధాలను ఏ విధంగా సవ్యంగా ఉంచగలరో, మరి వీటిని చెరిపే మార్గాల నుంచి ఎలా తప్పుకోవాలో మీరు నిర్ణయించుకోవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

ఇక గమనించండి. మీ దేహంతోను, ఇంటివారితోను, మరి తదితర జనులందరితోనూ సరయిన సంబంధం ఏర్పరచుకునేందుకు అడుగడుక్కి మీకు జ్ఞాన జ్యోతి అవసరం ఎంతైనా ఉంది. సరయినదేదో, కానిదేదో, సత్యమేదో, అసత్యమేదో, న్యాయమేదో, అన్యాయమేదో, ఒకరి హక్కు మీపై ఎంత ఉందో, మరి ఒకరిపై మీ హక్కు ఎంత ఉందో, ఏ విషయంలో వాస్తవలాభం ఇమిడి ఉందో, మరి ఎందులో నిజమైన నష్టముందో! అడుగడుక్కి మీరు తెలుసుకోవలసి ఉంటుంది. ఈ జ్ఞానాన్ని మీరు మీ మనస్సుల్లో అన్వేషిస్తే అక్కడ దొరకదు. ఎందుకంటే మనసు స్వతహాగా అజ్ఞాని. దాని వద్ద కాంక్షలు తప్ప వేరేముందనీ? "మధువును సేవించండి, వ్యభిచారం చెయ్యండి, అధర్మమైనదాన్ని కాజేయండి, వీటిలోనే మహదానందం ఉంది" అంటుంది. "అందరి హక్కును కాజేసి, ఎవరి హక్కునూ నెరవేర్చకండి, ఎందుకంటే ఇందులోనే సర్వత్రా లాభం ఉంది, అంతా మన కడుపున పోసుకోవలసిందే, ఇతరులకు ఇవ్వటమనేదే వద్దు" అని అంటుంది. ఇంకా "సొంత పనుల్ని మాత్రం అందరి ద్వారా సాధించండి, ఇతరులకు ఏ విధంగాను సహాయపడకండి. ఎందుకంటే ఇలా

చేయడమే లాభకరం, శ్రేయస్కరం" అంటుంది మనసు. ఇలాంటి అజ్ఞానానికి మీరు హస్తగతమైతే అది మిమ్మల్ని అధమాతి అధమ దశకు త్రోసివేస్తుంది. చివరికి మీరు అత్యంత స్వార్థపరులుగా, దుష్టమనస్కులుగా, దురాచారులుగా రూపొందుతారు. మీ ఇహపరాలు రెండూ చెడిపోతాయి.

ఇక రెండవ మార్గమేమంటే, మనస్సును వదలి తమ లాంటి ఇతర మానవుల్ని నమ్మి తమ సర్వస్వాన్ని వారి స్వాధీనం చేయడం, వారు తమకు తోచిన వైపునకు యీడ్చుకునిపోతే అటు వెళ్ళిపోవడం. ఇలా చేయడంలో ప్రమాదమేమంటే, ఒక స్వార్థపరుడయిన వ్యక్తి మిమ్మల్ని స్వయంగా తన కాంక్షలకు దాసులుగా చేసుకోగలడు. లేదా ఒక మూఢ వ్యక్తి స్వయంగా తానూ విహీనుడై మిమ్మల్ని దారి తప్పించి వేయగలడు. లేదా ఒక దౌర్జన్యకారుడు మిమ్మల్ని ఒక అస్త్రంగా వినియోగించి ఇతరులపై దౌర్జన్యం చేయగలడు. అంటే మంచీ చెడులలో, తప్పు ఒప్పులలో తారతమ్యాన్ని చూపించే ప్రపంచపు ఈ జీవితాన్ని సరయిన సన్మార్గంపై నడిపించగలిగే జ్ఞాన కాంతి ఇక్కడ మీకు ప్రాప్తం కాదు.

ఇక మిగిలింది పవిత్రమయిన దైవ సన్నిధి ఒక్కటే. ఇక్కడే మీకు ఈ జ్ఞానకాంతి లభించేది. దేవుడు సర్వం తెలిసినవాడు, అంతా చూడగలిగినవాడు, ఆయన ప్రతి దాని వాస్తవికతను ఎరిగినవాడు. మీ నిజ లాభనష్టాలు ఎందులో ఉన్నాయో, యదార్థానికి ఏ కార్యం సరయినదో, ఏది కాదో ఆయనే ఖచ్చితంగా చూపగలడు. ఆయన నిష్కామి, కాంక్షాతీతుడు, నిరపేక్షాపరుడు. ఆయనకు స్వయంగా ఎలాంటి అవసరాలు లేవు గనుక మిమ్మల్ని మోసగించి ఏదయినా లాభం ఆర్జించే ఆవశ్యకత లేదు (దైవం మన్నించుగాక). కాబట్టి సర్వ లోపాలకు అతీతుడయిన నిష్కామి, ప్రభువు ఎలాంటి ఆదేశమిచ్చినా నిస్వార్థంగా ఇస్తాడు. మరియు మీ మేలు కోరే ఇస్తాడు. అంతేకాదు

విశ్వప్రభువు న్యాయశీలుడు కూడాను. అత్యాచారమన్నది పరిశుద్ధమయిన ఆయన ఉనికిలో యిసుమంతయినా లేదు. కనుక ఆయన ఇచ్చే ఆజ్ఞ పరమ సత్యమైనది. ఆయన ఆజ్ఞానుసారం నడుచుకోవడం మూలాన మీరు మీ ఆత్మలపైనో లేక ఇతరులపైనో ఏదయినా అత్యాచారం చేయగలరేమో అనే ప్రమాదం కూడా లేదు.

అల్లాహ్ తరపున లభించే ఈ వెలుగును సద్వినియోగం చేసుకోవడానికి రెండు విషయాలు అత్యవసరం. మొదటిది: అల్లాహ్ను, ఈ వెలుగు ఎవరి ద్వారా ప్రసరిస్తుందో, ఆ దైవ సందేశహరుణ్ణి మనఃపూర్వకంగా విశ్వసించాలి. అంటే; దేవుని తరపున మహాప్రవక్త (సఅసం) అందజేసిన బోధన యెడల- దాని మర్మహేతువు మీకు బోధపడినా పడకపోయినా - అది పరమ సత్యమని అచంచల విశ్వాసముండాలి; రెండవ విషయం: అలా విశ్వసించిన పిదప ఆ బోధనను విధేయతతో పాటించాలి. ఎందుకంటే విధేయత ఆచరణలు లేకుండా ఫలితాన్ని ఆశించడం అర్థరహితం, ఉదాహరణకు ఎవరైనా ఒక పదార్థం విషమనీ, మారణ ఔషధమనీ, దాన్ని సేవించకూడదనీ, మీతో అన్నప్పుడు, మీరు "నీవన్నది నిజమే. ఇది విషమే, మారణౌషధమే" అంటూ దాన్ని ధృవీకరిస్తారనుకోండి, కాని ఇదంతా మీరు ఎరిగినప్పటికీ, దాన్ని అంగీకరించినప్పటికీ దాన్ని తింటారనుకోండి ఏం జరుగుతుంది? తెలియకపోవడం వల్ల తిన్నప్పుడు కలిగే పర్యవసానమే ఇప్పుడూ కలుగుతుంది అనే విషయం వ్యక్తమవుతూనే ఉంది. అయితే ఇలా తెలుసుకోవటం వల్ల లాభమేమిటి? విశ్వాసానికి తోడుగా విధేయత వల్లనే నిజ లాభం సమకూరుతుంది. ఆజ్ఞాపించిన విషయం పట్ల నోటితో మాత్రమే 'ఆమన్నా వ సద్దఖ్నా' (విశ్వసించాము, ఆమోదించాము) అనక దాని ప్రకారం ఆచరణ కూడా చేయాలి. ఏ విషయమైతే నిషేధింపబడిందో దాన్ని పరిత్యజించడానికే

మాటలతో ఆమోదం మాత్రం తెలుపడమేకాక క్రియాత్మకంగా దాన్ని త్యజించాలి.

అందుకే అల్లాహ్:

**"దేవునికి విధేయులై ప్రవక్తను అనుసరించండి."**

**"నా విధేయతను పాటించండి. మరి (నా) ప్రవక్తను అనుసరించండి."**

**"(నా సందేశహరుని) అనుసరిస్తేనే మీకు సన్మార్గం లభిస్తుంది."**

**"మా ప్రవక్త ఆదేశాలను అతిక్రమించేవారు ఏదయినా విపత్తుకు లోనవుతారేమో అని జాగ్రత్తపడాలి!" అని మరీ మరీ ఆదేశిస్తాడు.**

సోదరులారా! అల్లాహ్, ఆయన సందేశహరునికి మాత్రమే విధేయత పాటించాలని మరీ మరీ చెప్పడం చేత – మరే ఇతర మానవుని మాటనుససేమిరా వినకూడదనే అనుకోబోయేరు. అలా కాదు, దీని భావం ఏమిటంటే, ఎవరయినా ఒక కార్యం మిమ్మల్ని చేయమని కోరినట్లయితే, అది దైవం, ఆయన ప్రవక్త ఆదేశానుసారంగా ఉందా లేక దానికి విరుద్ధంగా ఉందా? అని నిత్యం పరిశీలిస్తూ ఉండండి. దైవం మరియు ప్రవక్తల ఆదేశానుగుణంగా చెప్పినప్పుడు అతని మాటను తప్పక సమ్మతించవలసిందే. ఎందుకంటే, ఈ విధంగా మీరు అతన్ని అనుసరించడంలేదు. వాస్తవానికి ఇది అల్లాహ్,ఆయన ప్రవక్తను అనుసరించడమే. అతడు దైవం, ఆయన ప్రవక్త బోధనకు వ్యతిరేకంగా చెప్పినప్పుడు అతని మాటను అతని ముఖాన కొట్టి వేయండి, అతను ఎవరయినా సరే. ఎందుకంటే, దైవం, ఆయన ప్రవక్త (సఅసం) తప్ప మరెవరి ఆజ్ఞాపాలనా, ధర్మమయినదీ, సముచితమయినదీ కాదు.

అల్లాహ్ స్వయంగా మీ చెంతకు వచ్చి మిమ్మల్ని ఆజ్ఞాపించడం మాత్రం కానేరని కార్యమని మీరుకూడా ఇట్టే గ్రహించగల విషయం. ఆయన

ఆజ్ఞలన్నీ తన ప్రవక్త ద్వారా పంపించాడు. ఇక మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా పదమూడున్నర వంద[illegible] ఏళ్ళ [illegible]తం పరమపదించారు. ఆయన ద్వారా దైవం పంపిన ఆజ్ఞలు , [illegible]సనాలూ అన్నీ దివ్య ఖుర్ఆన్ మరియు "హదీసుల్లో" ఉన్నాయి, కాని ఖుర్ఆన్, హదీసులు స్వయంగా మిమ్మల్ని ఒక విషయంలో ఆజ్ఞాపించాలన్నా లేక వారించాలన్నా వాటికి నడిచే, మాట్లాడే, ఆజ్ఞాపించే సామర్థ్యం లేదు. ఖుర్ఆన్, హదీసుల ఆదేశానుసారం మిమ్మల్ని నడిపించే వారు ఎటొచ్చీ మనుషులే. కనుక మానవుల విధేయత అనివార్యం. ఐతే గమనించవలసింది ఏమిటంటే, మీరు మనుషుల్ని కళ్ళు మూసుకుని మూఢంగా అనుసరించకూడదు. ఇంతకు ముందు వివరించినట్లు వారు ఖుర్ఆన్, హదీసుల ప్రకారం నడిపిస్తున్నారా లేదా అనే విషయాన్ని గమనిస్తూ ఉండాలి, ఖుర్ఆన్ హదీసులకు అనుగుణంగా నడిపిస్తే వారి విధేయత మీ కర్తవ్యమవుతుంది. అలాకాక వీటికి విరుద్ధంగా నడిపిస్తే వారి విధేయతను పాటించడం హరామ్ (అధర్మం) అవుతుంది.

★★★

# దీన్ మరియు షరీఅత్

ముస్లిమ్ సోదరులారా! ధర్మ సంబంధమయిన విషయాలలో రెండు మాటలు తరచుగా వింటూ ఉంటారు! వాటిని మీ సంభాషణలో వాడుతూ ఉంటారు కూడా. మొదటిది "దీన్," రెండవది "షరీఅత్". కాని దీన్ అంటే ఏమిటో తెలిసినవారు మీలో చాలా అరుదు. విద్యాబోధలు లేనివారైతే సరేసరి. బాగా విద్యాబుద్ధులు కలవారున్నూ చివరికి మౌలవీలనబడే చాలా మందికి ఈ రెండు పదాల సరయిన భావమేమిటో ఈ రెంటిలో గత భేదమేమిటో తెలీదు. ఇలా తెలియకపోవటం చేత తరచుగా "దీన్"ను "షరీఅత్"తోను, "షరీఅత్"ను "దీన్"తోనూ కలగాపులగం చేస్తారు. దానివల్ల చాలా అవకతవకలు ఏర్పడుతాయి, చాలా సాధారణ మాటలలో వీటి భావం వెల్లడిస్తాను.

'దీన్' అనే పదానికి ఎన్నో అర్థాలు. ఒకటి గౌరవం, పరిపాలనా రాజ్యం, రాజరికం మరియు ఆధిపత్యమని; రెండవది, దీనికి పూర్తిగా భిన్న మయినది, లొంగి ఉండటం, విధేయత, సేవ, ఆజ్ఞాపాలన మరియు దాస్యమని; మూడవ భావం, లెక్కించటం, తీర్పు చేయటం, చర్యలకు

సత్ఫలితమో దుష్ఫలితమో ఇవ్వడమని. ఖుర్ఆన్‌లో 'దీన్' అనే పదం ఈ మూడు అర్థాలలోనూ ఉపయోగించబడింది.

"అల్లాహ్‌కు సమ్మతమయిన ధర్మం ఇస్లామ్ మాత్రమే."

అంటే దైవం సమ్మతించే దీన్ అనేది కేవలం ఒక్కటే. మనిషి వేరే ఎవరి సమక్షాన కూడా వినమ్రుడవకూడదు, అల్లాహ్‌ను మాత్రమే ప్రభువూ, యజమాని, సర్వాధికారి అని భావించాలి. ఆయనకు తప్ప మరెవ్వరికీ దాసుడుగా, ఆజ్ఞల్ని పాలించేవానిగా, విధేయుడుగా ఉండకూడదు. కేవలం అల్లాహ్‌ను మాత్రమే లెక్క చూచేవానిగా, శిక్షనో, బహుమానాన్నో ప్రసాదించే వానిగా భావించాలి. ఆయన తప్ప మరెవరి విచారణకు భయపడకూడదు. ఎవరి బహుమానాన్ని ఆపేక్షించకూడదు. ఎవరి శిక్షకూ భీతిల్లకూడదు. ఈ దీన్ పేరే ఇస్లామ్, దీన్ని కాదని మనిషి దైవం తప్ప మరెవరినైనా నిజమయిన గౌరవం గలవాడని, నిజమయిన అధికారి అని, నిజప్రభువనీ, యజమాని అనీ, శిక్ష, బహుమానాల ప్రదాత అని భావించడం, అతని ముందు వినమ్రతతో తలవంచడం, అతని దాస్యం చేయడం, అతని సేవ చేయడం, అతని ఆజ్ఞను ఆమోదించడం, అతని బహూకరణను ఆపేక్షించి; శిక్షకు భీతి చెందడం ఇదంతా అసత్య ధర్మం (దీన్). ఇలాంటి దీన్‌ని ఎన్నటికీ ఆమోదించడు అల్లాహ్, ఎందుకంటే ఇదంతా వాస్తవికతకు విరుద్ధమయింది - ఈ విశ్వం మొత్తంలో నిజమయిన గౌరవం గలవాడు దేవుడు తప్ప మరెవడూ లేడు. మరెవ్వరి రాజ్యమూ, రాజరికాలూ లేవు, వాస్తవానికి అల్లాహ్ తప్ప ఇతరుల విధేయతకై, దాస్యానికై మనిషి సృజింపబడలేదు. ఈ నిజ ప్రభువు తప్ప శిక్షనో, బహూకృతినో మన కర్మల ప్రతి ఫలంగా ఇచ్చేవాడు కూడా మరొకడు లేడు, ఇదే విషయాన్ని ఇతర ఆయతులలో దివ్య ఖుర్ఆన్ వాక్యాలలో ఈ రీతిగా వక్కాణింపబడింది.

"ఎవరయితే దేవుని ఆధిపత్యమూ, ప్రభుత్వమూ కాదని ఇతరులను తన స్వామిగా, అధికారిగా భావిస్తూ అతని సేవా దాస్యాలను ఆచరిస్తాడో, అతణ్ణి సత్ఫలితమో, దుష్ఫలితమో ప్రసాదించేవానిగా పరిగణిస్తాడో అతని 'దీన్'ని (జీవన మార్గాన్ని) దైవం ఎన్నటికీ ఆమోదింపడు" ఎందుకంటే,

మానవులనయితే తన దాసులుగా సృష్టించాడు దేవుడు. తనను తప్ప మరెవరి దాస్యం కూడా చేయడానికి ఆయన వీరిని అనుమతించనేలేదు. కనుక అన్నింటికీ విముఖులయి కేవలం అల్లాహ్ కొరకే తమ "దీన్"ని అంటే విధేయతా దాస్యాల్ని ప్రత్యేకించవలసిన బాధ్యత వీరి విధి. ఏక దీక్షగా కేవలం ఆయన (దేవుని) దాస్యాన్నే పాటిస్తూ ఆయన విచారణకే భీతి చెందాలి.

"మానవుడు దైవం తప్ప ఇతరుల దాస్యం, విధేయతలు పాటించ దలిచాడా? వాస్తవానికి భూమ్యాకాశాలలోని సర్వమూ కేవలం దైవానికి మాత్రమే సేవ, దాస్యాలు చెల్లిస్తోంది. ఇవన్నీ వాటి లెక్కల జవాబు చెప్పుకోడానికి దైవం తప్ప మరే వైపునకూ పోలేవు. భూమ్యాకాశాలకు విశ్వాన్నంతటికీ భిన్నంగా వింతయిన క్రొత్త మార్గ మొకదాన్ని మనిషి తనకై సృజించుకోదలిచాడా?

"అల్లాహ్ తన (రసూల్) సందేశహరుణ్ణి సత్య ధర్మ జ్ఞానం ఇచ్చి పంపినది, దీనిపై మిథ్యా దేవుళ్ళ దైవత్వాన్ని అంతం చేసి మనిషిని విశ్వ ప్రభువుకు తప్ప ఇతరులకు దాసుడై ఉండకుండా బంధ విముక్తుణ్ణి చేయడానికే. దైవం తిరస్కారులూ, బహు దైవారాధకులు తమ మూఢత్వం అజ్ఞానాల మూలంగా ఎంతగా రోదన చేసినా, ఏహ్య పడినా ఈ కర్తవ్య నిర్వహణే వారి ధ్యేయం.

"ప్రపంచంలో నుంచి దైవేతరుల ఆధిపత్యపు దుష్టత్వం సమసిపోవాలి, భువిలో కేవలం దైవశాసనమే చెలామణి అవ్వాలి. కేవలం దైవ ప్రభుత్వమే జనసమ్మతమవ్వాలి. మనిషి కేవలం దేవునికి మాత్రం దాస్యం చేయాలి. అంత వరకూ దుష్టశక్తులతో పోరాడుతూ ఉండూ."

ఈ వివరణల ద్వారా 'దీన్' అర్థమేమిటో మీకు బాగా అవగతమై ఉంటుంది.

★ దైవాన్ని ప్రభువు, యజమాని, అధిపతిగా, స్వీకరించడం.
★ దైవం పట్ల మాత్రమే దాస్యం, సేవ, విధేయత ఆచరించడం.
★ దేవుని విచారణ ఎడల భయపడటం, ఆయన శిక్షకు భీతిజెందుతూ ఆయన బహుమానాలను వాంఛించడం.

అయితే - దైవాజ్ఞలు, ఆయన దివ్య గ్రంథం మరియు ఆయన సందేశహరుల ద్వారానే మానవులకు చేరగలవు. కనుక ప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను దైవ ప్రవక్తగాను, దివ్య ఖుర్ఆన్‌ని దైవ గ్రంథంగానూ విశ్వసించడం, దాని ఆజ్ఞల్ని పాలించడం కూడా 'దీన్'లో చేరినదే. దివ్య ఖుర్ఆన్ ప్రబోధం:

**"ఓ ఆదమ్ వంశీయులారా! నా సందేశహరులు నా ఆదేశాల్ని మీ వద్దకు తెచ్చినప్పుడు మీలో, ఎవరు ఆ ఆజ్ఞల్ని స్వీకరించి దైవ భీతితో సదాచారాన్ని అవలంబిస్తారో, వాటి ప్రకారం తమ ఆచరణను చక్కబరచుకుంటారో వారికి ఎలాంటి భయ దుఃఖాలు కలగవు."**

దీని వల్ల తేలిందేమంటే, అల్లాహ్ ప్రతి వ్యక్తికీ నేరుగా తన ఆదేశాలను పంపడు. తన ప్రవక్తల ద్వారా పంపిస్తాడు. కనుక అల్లాహ్‌ను ప్రభువుగా అంగీకరించిన వ్యక్తి, ఆయన ప్రవక్తలకు విధేయుడయి, వారి ద్వారా లభించిన ఆదేశాలను పాటిస్తే దేవుని ఆజ్ఞాపాలన చేసినవాడవుతాడు. దీనికే "దీన్" (ధర్మం) అని పేరు.

ఇక "షరీఅత్" అంటే ఏమిటో వివరిస్తాను: "షరీఅత్" అంటే "విధానం, మార్గం" అని భావం. మీరు దేవుణ్ణి పాలకునిగా స్వీకరించి ఆయన యెడల తమ దాస్యాన్ని అంగీకరిస్తే ప్రవక్తను దేవుని తరఫున సాధికార శాసకుడనీ, దివ్య గ్రంథం దేవుని చేత పంపబడిన గ్రంథమని సమ్మతిస్తే మీరు దీన్‌లో ప్రవేశించినట్లే, ఆ తరువాత దేవుని దాస్యం చేయవలసిన విధానం, ఆయనకు విధేయత చెల్లించడానికి అనుసరించవలసిన మార్గాన్ని సయితం దైవం తన ప్రవక్త ద్వారానే సూచిస్తాడు. తమ యజమాని ఆరాధన ఈ విధంగా చేయాలి. పరిశుభ్రత, పరిశుద్ధత పొందే పద్ధతి ఇది. సదాచారపరమైన మార్గనిష్ఠాపరాయణతకు దారి ఇదే. హక్కులను ఈ విధంగా నిర్వర్తించాలి. వ్యవహారాలను ఇలా చక్కబెట్టుకోవాలి. జీవితం గడపవలసిన బాట ఇదే అని అంతా ఆ దైవ ప్రవక్తయే బోధిస్తాడు. అయితే దీన్, షరీఅత్‌లలో భేదమేమంటే, దీన్ ఎల్లప్పుడూ ఒక్కటే. ఒక్కటిగానే ఉంటూ వచ్చింది. ఇంకా ఒక్కటిగానే ఉంది. కాని అనేక షరీఅత్‌లు వచ్చాయి. ఎన్నో రద్దు చేయబడ్డాయి, మరెన్నో మార్చబడ్డాయి. అయితే వీటి మార్పు వల్ల "దీన్" ఎన్నటికీ మారలేదు. హజ్రత్ నూహ్ (అలై) ప్రబోధించిన దీన్‌నే (ధర్మాన్నే), హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై), హజ్రత్ మూసా (అలై), హజ్రత్ షుఐబ్ (అలై), హజ్రత్ సాలేహ్ (అలై), హజ్రత్ హూద్ (అలై) మరియు హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ప్రబోధించారు. కాని వీరందరి షరీయతులు ఎంతో కొంత విభిన్నంగా ఉంటాయి. నమాజ్ (ప్రార్థన) రోజా (ఉపవాస వ్రతం) విధానాలు ఒక షరీఅత్‌లో ఒక రీతిలో ఉంటే, మరొకదానిలో ఇంకొక పంథాలో ఉండేవి. హలాల్-హరామ్ (ధర్మాధర్మాల) నియమాలు పరిశుభ్రతా నిబంధనలు, వివాహ విడాకులు, వారసత్వాలకు సంబంధించిన చట్టాలు ప్రతి ఒక షరీఅత్‌లో మరియొక షరీఅత్‌లో కంటే కొంత వరకయినా భిన్నంగా

ఉండేవి. ఇలా అయినప్పటికీ వీటిని పాటించినవారందరూ ముస్లిములే - హజ్రత్ నూహ్ (అలై) అనుచరులు, హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) అనుచరులు, హజ్రత్ మూసా (అలై) అనుచరులు మరియు హజ్రత్ ముహమ్మద్ (సఅసం) అనుచరులమయిన మనం - అందరూ ముస్లిములే. ఎందుకంటే, దీన్ అందరిదీ ఒక్కటే. దీని ద్వారా తెలిసివచ్చే దేమంటే షరీఅత్ ఆదేశాలలో భేదమున్నంత మాత్రాన దీన్‌లో ఎలాంటి మార్పు సంభవించదు. దీన్‌పై అమలు చేసే పద్ధతులు వేర్వేరయినా దీన్ మాత్రం ఒక్కటిగానే ఉంటుంది.

ఈ వ్యత్యాసాన్ని ఒక ఉదాహరణ ద్వారా అర్థం చేసుకోండి. ఒక యజమానికి చాలా మంది సేవకులున్నారు. వీరిలో అతన్ని యజమానిగా అంగీకరించక, ఆయన ఆజ్ఞాపాలన తనకు అనుసరణీయం కాదని భావించేవాడయితే అవిధేయుడు. దాస్య పరిధి నుంచే తొలగింపబడతాడు. ఇకపోతే ఆయన్ని తన యజమానిగా సమ్మతించి, ఆయన ఆజ్ఞాపాలన తమ విధి అని భావించేవారు, ఆయన యెడల అవిధేయతగా వ్యవహరించడానికి భయపడేవారు - అంతా సేవకుల జాబితాకు చెందినవారే. యజమాని యొక్క దాస్యం చేయడంలో వారి విధానాలు వేర్వేరు అయినప్పటికి వారు సేవకులనటంలో ఏ మాత్రం లోటు వాటిల్లదు.

సేవ చేసే విధానం ఒకరికి ఒకటి, మరొకరికి ఇంకొకటి యజమానే సూచించినప్పుడు, తాను మాత్రమే సేవకుడు అని ఇతరులంతా కారని అనడానికి ఏ సేవకునికి ఎలాంటి అధికారం లేదు. ఇదే విధంగా ప్రభు ఆదేశాన్ని విని దాని భావం ఒక విధంగాను, మరొకతను మరొక రీతిగాను అవగాహన చేసుకుని వారిద్దరు తమ బుద్ధి బలానికనుగుణంగా ఆ ఆదేశాన్ని పాటించినట్లయితే సేవజేయడంలో ఇద్దరూ సమానులే. వీరిలో ఒకతని భావం గ్రహించడంలో పొరబాటు చేయటం మరొకతను నిజభావాన్ని

గ్రహించడం కూడా సంభవమే. కాని ఇద్దరూ నిష్కపటంగా, విధేయులుగా వ్యవహరించినప్పుడు ఒకణ్ని అవిధేయుడని లేక అతణ్ణి ప్రభు దాస్యం నుండి తొలగించడమయినదనీ, అనే అధికారం మరొకనికి లేదు.

ఈ ఉదాహరణ ద్వారా దీన్ - షరీఅత్‌ల వ్యత్యాసాన్ని మీరు క్షుణ్ణంగా బోధపరచుకోగలరు. మహాప్రవక్త (సఅసం) కంటే ముందు విభిన్న ప్రవక్తల ద్వారా దేవుడు విభిన్న షరీఅత్‌లు పంపిస్తూ వచ్చాడు. ఒకరికి ఒక పంథాకు చెందిన సేవా విధానం చూపిస్తే, మరొకరికి ఇంకొక కోవకు చెందిన విధానం చూపించాడు. ఆయా విధానాల ప్రకారం ప్రభువుకు ఎవరు విధేయులయి మెలిగారో, వారి సేవా విధానాలు వేర్వేరయినప్పటికీ వారంతా ముస్లిమ్‌లే. మహాప్రవక్త (సఅసం) ప్రభవించినప్పుడు 'పూర్వపు విధానాలన్నింటినీ మేము రద్దు చేస్తున్నాము. ఇక మీదట మా సేవ చేయదలచిన వారు మేము మా అంతిమ ప్రవక్త ద్వారా సూచిస్తున్న పద్ధతి ప్రకారమే సేవ చేయాలి!' అని ఆదేశించాడు విశ్వప్రభువు. తదనంతరం సేవకులకు పూర్వపు పంథాలో సేవ చేసే హక్కు మిగలదు. ఎందుకంటే, అతను క్రొత్త పద్ధతులను స్వీకరించక పురాతన రీతుల కనుగుణంగా ఆచరించాడంటే, వాస్తవానికి అతను పాటించేది ప్రభు ఆజ్ఞ కాదు. తన మనోవాంఛలనే అనుసరిస్తున్నాడన్న మాట. కనుక అతను దాస్యం పరిధికి దూరమయ్యాడు అంటే ధార్మిక పరిభాషలో కాఫిర్ (అవిశ్వాసి, తిరస్కారి) అయ్యాడన్న మాట.

ఇది వెనుకటి ప్రవక్తలను అనుసరించేవారి మాట. ఇక పోతే మహాప్రవక్త (సఅసం)ని అనుసరించే వారికి పై ఉదాహరణలోని రెండవ భాగం వర్తిస్తుంది. ప్రవక్త శ్రేష్ఠులు (సఅసం) ద్వారా అల్లాహ్ పంపిన షరీఅత్‌ను దైవ శాసనంగా విశ్వసించి దాన్ని పాటించడం తమ విధి అని అంగీకరించే వారందరూ ముస్లిములే. వీరిలో ఒక వ్యక్తి షరీఅత్ చట్టాలను ఒక విధంగా అర్థం చేసుకోగా

మరొకతను ఇంకొక రీతిలో అవగాహన చేసుకోగలడు. ఇద్దరూ తమ తమ జ్ఞానోచితంగా దానిపై అమలు జరిపినట్లయితే, వారి ఆచరణలో ఎంత భేదం ఉన్నప్పటికీ వారిలో ఎవరూ కూడా తమ హోదాకు దూరం కారు. ఎందుకంటే, వారిలో ప్రతి ఒక్కడు తాను ఆచరించే విధానం తన ప్రభువాదేశించినదేనని మనఃపూర్వకంగా నమ్మడం వల్లనే కదా ఆచరిస్తాడు. అలాంటప్పుడు ఒక నౌకరుకు "నేనయితే సేవకుణ్ణే కాని ఫలానా వ్యక్తి కాదు" అని అనడానికి ఏమి అధికారం ఉంది? మహా అంటే నేను ప్రభువాజ్ఞలోని నిజ భావాన్ని గ్రహించాను కాని అతను గ్రహించలేకపోయాడు అని అనగలడు. అంతేకాని అతన్ని ఉద్యోగం నుండి బహిష్కరించే అర్హత ఎలా లభిస్తుంది? అలా బహిష్కరణా ప్రకటనకు సాహసించే వ్యక్తి వాస్తవానికి తానే స్వయంగా యజమాని వేదికను అలంకరించాడన్న మాట. అతను సెలవిచ్చేదేమంటే– "నీవు ఏ విధంగా ప్రభువాజ్ఞాపాలనకు బద్ధుడవయ్యావో అలాగే నా భావాలన్నీ అంగీకరించడానికి కూడా బద్ధుడవే! నా భావాలతో ఏకీభవించకపోతే నా సొంత అధికారాల్ని ఉపయోగించి నిన్ను ప్రభువు కొలువు నుంచి గెంటివేస్తాను." ఇది ఎంత పెద్ద విషయమో గమనించారా? అందుకే మహాప్రవక్త (సఅసం) ఈ విధంగా ఆదేశించారు – "ఎవరయితే ఒక ముస్లిమ్‌ని నిష్కారణంగా తిరస్కారి అనంటాడో అతని మాట తిరిగి అతని పైనే పడుతుంది. ఎందుకంటే, దేవుడయితే ముస్లిమ్‌ని తన ఆదేశాలకు మాత్రమే బానిసగా ప్రకటించాడు. కాని ఈ వ్యక్తి నా భావాలకు, నా అభిప్రాయాలకు కూడా దాస్యం చేయమంటాడు. అంటే దేవుడు ఒక్కడే నీ దైవం కాదు, నేను కూడా ఒక చిన్న దేవుణ్ణే, నా ఆదేశాన్ని కాదన్నారా, నా సొంత అధికారాన్ని వినియోగించి మిమ్మల్ని దాస్యంలో నుంచి దైవం బహిష్కరించకపోయినా – నేనే బహిష్కరించగలను" అంటాడు. ఇతడు ఇంత ఘోరమైన మాట పలకటం

వల్ల ఎదుటి వ్యక్తి తిరస్కారి అవుతాడో, కాడో కాని ఇతను స్వయంగా తానే కుఫ్ర్ ఊబిలోకి పడిపోయే ప్రమాదావస్థకు గురి అవుతాడు.

మిత్రులారా! మీకు "దీన్," "షరీఅత్"లలో గల వ్యత్యాసం క్షుణ్ణంగా బోధపడి ఉంటుంది. సేవనా విధానంలో విభిన్నత కారణంగా "దీన్"లో ఎలాంటి వ్యత్యాసమూ తారసిల్లదని మీరు తెలుసుకుని వుంటారు. అయితే మనిషి తాను ఆచరించే విధానం గురించి అది దైవం, ఆయన ప్రవక్త చూపిన విధానమేనని సంకల్ప శుద్ధితో విశ్వసిస్తూ మరీ ఆచరించాలి.

ఇక "దీన్" "షరీఅత్"లలో గల ఈ తారతమ్యాన్ని అర్థం చేసుకోక పోవడంచేత మన సమాజంలో ఎన్ని అనర్ధకాలు, అనాహూతాలు సంభవిస్తున్నాయో వివరించదలిచాను.

ముస్లిముల్లో నమాజ్ చేసే విధానాలు భిన్నంగా ఉన్నాయి. ఒక వ్యక్తి రొమ్ముపై చేతులు కట్టుకోగా, మరొకతను బొడ్డుపై కట్టుకుంటాడు. ఒక వ్యక్తి ఇమామ్ వెనుక సూరా - ఎ - ఫాతిహా పఠించగా మరొకతను పఠించడు. ఒక వ్యక్తి "ఆమీన్" అని బిగ్గరగా అంటే, మరొకతను మెల్లిగా అంటాడు. వీరిలో ప్రతి వ్యక్తి తాను ఆచరించే విధానం, మహాప్రవక్త (సఅసం) వారి విధానమే అని భావిస్తూ ఆచరిస్తాడు. అందువల్ల వారు చేసే ఆ నమాజ్ పద్ధతులు భిన్నమయినప్పటికీ వారుభయులూ మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) అనుసరణ చేసేవారే. కాని, ఈ షరీఅత్ సమస్యల్ని దీన్ అని భావించే ప్రబుద్ధులు కేవలం రీతులలో ఉన్న ఈ తారతమ్యాల్ని దీన్‌లో విభేదమని తలంచారు. తమ సంఘాలు వేరుపరుచుకున్నారు. తమ మస్జిద్‌లు వేరుగా నిర్మించుకున్నారు, పరస్పరం దూషించుకున్నారు. ఇతరుల్ని మసీదుల నుంచి తరిమివేశారు. వ్యాజ్యాలాడారు. ముహమ్మద్ (సఅసం) అనుచర సంఘాన్ని ఛిన్నాభిన్నం చేశారు.

అంతటితో పోరాడేవారు, పోరాటానికి పురికొలిపేవారు చల్లబడలేదు. చిన్న చిన్న విషయాల కారణంగా తిరస్కారులనీ, భ్రష్టులనీ, మార్గవిహీనులనీ, పరస్పరం నిందించుకున్నారు. ఒక వ్యక్తి తనకు గల బుద్ధితో ఖుర్ఆన్, హదీసుల ద్వారా ఒక విషయాన్ని గ్రహిస్తే, తాను గ్రహించినదానిపై తాను ఆచరించడంతో తృప్తిజెందడు. దాన్ని ఇతరుల చేత బలవంతంగా ఒప్పించడం కూడా అవశ్యమని భావిస్తాడు. కాని దాన్ని వారు స్వీకరించకపోతే దైవం అనుగ్రహించిన ధర్మం (దీన్) నుంచే వారిని బహిష్కరించడం కూడా అవసరమని భావిస్తాడు.

ముస్లిముల్లో హనఫీ, షాఫయీ, అహలే హదీస్ ఇత్యాది విభిన్న వర్గాల వారంతా ఖుర్ఆన్, హదీస్‌లనే తమ అంతిమ ప్రమాణాలని అంగీకరిస్తారు. తమ బుద్ధీజ్ఞానాలను వినియోగించి వాటి నుంచే శాసనాలను పరిగ్రహిస్తారు. ఇందులో ఒకరు గ్రహించిన విషయం సరయినది కావచ్చు. ఇంకొకరి భావం సరయినది కాకపోవచ్చు. నేను కూడా ఒక విధానాన్ని అనుసరిస్తాను. దాన్ని సముచితమైనదని తలుస్తాను. నేను భావ్యమని తలిచేదాన్ని ఇతరులకు బోధపరచడానికి, నేను అనుచితమని భావించేదాన్ని అనుచితమని ఋజువుపరచడానికి ఇతరులతో చర్చిస్తాను కూడా. కాని ఒకరి భావగ్రహణలో తప్పు జరగడం వేరు, 'దీన్' నుంచే దూరమవడం వేరు. తనకు సమంజసమని తోచిన దాని ప్రకారం షరీఅత్‌ని అనుసరించడానికి ముస్లిమయిన ప్రతి వ్యక్తికీ అధికారముంది. పది మంది ముస్లిమ్‌లు పది విభిన్న విధానాలను అనుసరించినప్పటికీ సిద్ధాంతప్రాయంగా షరీఅత్‌ను అంగీకరించినంతవరకు వారందరూ ముస్లిములే. ఒకే అనుచర సంఘం (ఉమ్మత్) లోనివారే. వారి సంఘాలు వేర్వేరు కావడానికి ఎలాంటి ఆస్కారం లేదు. కాని ఈ విషయాన్ని అర్థం చేసుకోలేని వారు పరస్పరం దూరమవుతారు; తమ నమాజులూ,

మస్జిదులూ వేరు చేసుకుంటారు. వివాహ సంబంధాల్ని, బంధుత్వాన్ని కలిసి మెలిసి జీవించడాన్ని వదలివేస్తారు. తమ తమ వర్గ సంఘాలను నిర్మించు కుంటారు. ప్రతి సంఘం ఒక ఉమ్మత్ (అనుచర సంఘం) అయినట్లు భావించుకుంటారు.

ఈ వర్గ భావన మూలాన ముస్లిములకు ఎంతటి నష్టం వాటిల్లిందో మీరూహించలేరు. పేరుకు మాత్రం ముస్లిములంతా ఒక ఉమ్మత్‌గా ఉన్నారు. భారత దేశంలో మీ సంఖ్య కొన్ని కోట్ల వరకు ఉంది. ఇంత పెద్ద సముదాయం వాస్తవంగా ఏకమై పరిపూర్ణ సహభావంతో దైవవాణి ఉన్నతికై కృషి చేస్తే గౌరవ ఔన్నత్యాలు వీరి పాదాలొత్తడానికి నిరీక్షిస్తున్నాయి. కాని ఈ వర్గభావన మూలాన ఉమ్మత్‌లో లెక్కలేనన్ని వర్గాలు ఉదయించాయి. వీరి ఆంతర్యాలు పరస్పరం విచ్ఛిన్నమయిపోయాయి. కఠినాతి కఠిన సందర్భంలోనూ వీరు ఒక్కటయి కలసి నిలువలేకపోతున్నారు. యూదులు క్రైస్తవుల పట్ల కనబర్చే వైషమ్యమే ముస్లిముల ఒక వర్గంలోని వారు మరొక వర్గస్తుల పట్ల చూపిస్తున్నారు. ఇంకా అంతకంటే అధికమే అనవచ్చు. ఒక వర్గంలోని వారు ఎదుటి వర్గీయులను నీచపరచడానికి ఇతరులతో సయితం సహకరించిన సందర్భాలు కూడా లేకపోలేదు. ఇలాంటి పరిస్థితిలో ముస్లిమ్‌లు క్షీణదశ, అధమ గతికి లోనైతే ఆశ్చర్యపడనవసరంలేదు. ఇది వీరి స్వార్జితం- దైవం తన దివ్య గ్రంథంలో పేర్కొన్న శిక్షాయాతనలే వీరిపై ఆసన్నమయ్యాయి. అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు.

**"మిమ్మల్ని విభిన్న వర్గాలలో విభజించివేయగా మీరు పరస్పరం హతమార్చుకోవడం కూడా దైవ శిక్షకు ఒక రూపమే."**

సోదరులారా! ఈ వర్గభావనను రూపుమాపనంత వరకు భారతదేశంలోని

ముస్లిములంతా అనుభవిస్తున్న ఈ శిక్ష నుంచి విమోచనం సాధ్యంకాదు. మీరు మీ శ్రేయాన్నే అభిలషిస్తే జాగుచేయక ఈ వర్గాల్ని నిర్మూలించండి. అన్యోన్యంగా సహోదరులై జీవించండి. ఒక్క ఉమ్మత్‌గా ఏర్పడండి. అహ్‌లె హదీస్, హనఫీ, దేవ్‌బంది, బరేల్వి, షియా, సున్నీ తదితర వేర్వేరు ఉమ్మతులుగా ఏర్పడటానికి దైవ శాసనం (షరీఅత్)లో ఎలాంటి తావులేదు. ఈ ఉమ్మతులు అజ్ఞానం మూలాన ఉద్భవించాయి. అల్లాహ్ ఏర్పరచినది ఒకే ఉమ్మత్ – "ఉమ్మతే ముస్లిమా."

–:సమాప్తం:–